# భక్త కనకదాసు



ప్రథమ ము॥ ౧౯౦

ప్రతులు : 1000.

మూల్యం : రూ. 10-00.

---

Published with the Financial

Assistance of

TIRUMALA TIRUPATHI DEVASTHANAMS

Under 'AID TO AUTHORS SCHEME'

---

ముఖపత్రం : జగదీశ్ & ద్వారకనాథ్

ప్రాప్తిస్థానం :
విద్వాన్ కే. యస్. మురళీధర్
సీనియర్ తెలుగు పండిట్
న్యూకాలనీ
పాకాల : 517112
చిత్తూరుజిల్లా

ముద్రణ :
విక్టరీ ప్రెస్,
విజయవాడ-1

# అంకితం



P. V. R. K. ప్రసాద్

కర్తవ్య నిర్వహణను ప్రార్థనగా, దైవారాధనగా భావించే వ్యక్తులు చాలా అరుదు. చేసే ప్రతి పనీ భగవత్ప్రేరణగా భావించే అనుసంధానం ముఖ్యమని మన శాస్త్రాలు నిర్దేశించాయి. ఇలాంటి పవిత్రమైన దృష్టితో తమ విధ్యుక్తధర్మాన్ని నిర్వహించే ఆదర్శవ్యక్తి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్‌గారు. పుస్తక ప్రచురణ యజ్ఞంగా మారిపోయి, రచయితలకు గగన కుసుమమైపోయిన ఈ రోజుల్లో, తి తి దే. సంస్థ ద్వారా ధార్మిక గ్రంథాలకి ఆర్థిక సహాయం అందించే ప్రణాళికను ప్రారంభించి, రచయితలకు ప్రసాద్‌గారు ఒక రకంగా ఊపిరి పోశారు.

ఆయనొక డైనమిక్ పర్సనాలిటీ. ధైర్యమూ, చొరవా, సమయస్ఫూర్తీవున్న వ్యక్తిగా ఆయనను, ఆయనతో పరిచయంవున్న వాళ్ళందరూ ఎరుగుదురు. దైవాన్ని విశ్వసించి, తమ విధ్యుక్తధర్మాన్ని స్వామి సేవగా భావించి, ఆదర్శప్రాయులుగా భాసిస్తున్న శ్రీ పి. వి. ఆర్. కె ప్రసాద్, ఐ. ఏ. యస్. గారికి ఈ పుస్తకాన్ని సవినయంగా అంకితం ఇస్తున్నాను.

—రచయిత

శ్లో॥ శ్రీ రమణి కరకమల పూజిత చారుచరణ సరోజ బ్రహ్మ స।

మీరవాణి ఫణీంద్రపీంద్ర భవేంద్ర ముఖవినుతా।

నీరజ భవాండోదయ స్థితి కారణనె కైవల్య దాయక।

నారసింహనె నమిపె కరుణిపు దెమగె మంగళవ।

# ముందుమాట

కన్నడ వాగ్గేయకారులలో 'కనకదాసు' సముచిత స్థానం పొందిన వ్యక్తి. సలలితమైన భాషలో, వేదాంతాన్నీ, భక్తినీ, నీతినీ, ధర్మాన్నీ బోధించే కీర్తనల నెన్నింటినో రచించి, గానంచేసి, సాధారణ మానవులను అజ్ఞాన సుషుప్తినుండి తట్టిలేపిన వైతాళికు డీయన.

తిరుమల వేంకటేశ్వరస్వామిని ఆరాధ్యదైవంగా భావించి, అనేక పర్యాయాలు ఆ స్వామిని దర్శించి, ఆయనను స్తుతిస్తూ, ఎన్నో కీర్తనలను రచించిన కనకదాసులు తెలుగువారికి అభిమాన వాగ్గేయ కారుడుగా రూపొందారు. కన్నడ సాహిత్యంలో ధ్రువతారగా వెలు గొందుతున్న ఈయన చరిత్రను తెలుగు పాఠకులకు అందించాలనే సంకల్పం ఈ పుస్తకంగా రూపొందింది. ధన-ధాన్యాలతో తుల తూగుతూ, అధికార ప్రాభవంతో అలరారుతూ, స్వామి ప్రేరణతో సకల ఐశ్వర్యాలనూ, అధికారాన్నీ తృణప్రాయాలుగా పరిత్యజించి, హరిదాసుగా మారి సోదరమానవుల శ్రేయస్సుకై తన కవిత్వం ద్వారా నిరంతరం కృషిచేసిన ఉదాత్తు డీయన. అద్భుత సంఘటన లతో నిండివున్న కనకదాసుల చరిత్ర పాఠకులను ఆకర్షించి, అల రిస్తుందని ఆశిస్తున్నాను.

కనకదాసుల జీవితచరిత్రను పుస్తకరూపంగా వెలువరించాలన్న సంకల్పం కార్యరూపం దాల్చడానికి తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యం అందించిన సహకారం ఎంతో గొప్పది. నా రచనను

ఎంపికచేసి, ద్రవ్యసహాయం లభించడానికి కారకులైన ఎక్స్‌పర్ట్ కమిటీ సభ్యులకూ, తి తి దే. పౌరసంబంధ శాఖాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారికి, సప్తగిరి సంపాదకులు శ్రీ కె. సుబ్బారావుగారికి, ధన్యవాదాలు అర్పించుకుంటున్నాను.

రచయితలకు ఆర్థిక సహకార పథక ఆవిర్భావానికి కారకులైన అప్పటి తి తి.దే కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్. ఐ. ఏ. ఎస్, గారికి, ప్రస్తుత కార్యనిర్వహణాధికారి శ్రీ బి. కుమారస్వామిరెడ్డిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ రచన సందర్భంగా అమూల్యమైన సూచనలిచ్చి సహకరించిన శ్రీ కె. అప్పణ్ణాచార్యగారికి, నన్ను ఎంతగానో ప్రోత్సహించిన పాకాల జూనియర్ కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ K. సుబ్బారావుగారికి, లెక్చరర్స్ శ్రీ K. గోపాల్‌రెడ్డి, శ్రీ M. మాధవరెడ్డిగార్లకూ, నా ప్రియమిత్రుడు శ్రీ నంగా నారాయణరెడ్డి (L. T. అసిస్టెంటు) గారికి, వ్రాతప్రతిని సిద్ధం చేయడంలో సహాయంచేసి తోడ్పడిన మిత్రులు శ్రీ పి వెంకటముని (తెలుగు పండిట్) గారికి నా ధన్యవాదాలు.

ఎల్లప్పుడూ నా క్షేమాన్ని కోరే సహృదయులు, స్నేహపాత్రులూ అయిన శ్రీ కే. శేషగిరిరావు, హెడ్‌మాస్టర్ (మొలకలచెరువు) గారికి, శ్రీ కె. విన్సెంట్. హెడ్‌మాస్టర్ (కురచలకోట) గారికి, శ్రీ జి. యస్. రాజారావు, టీచరు (నిమ్మనపల్లి) గారికి, శ్రీ నెమలి భానుమూర్తి (మదనపల్లె) గారికి, యస్. సూర్య

నారాయణశాస్త్రి, తెలుగుపండిట్ (గుఱ్ఱంకొండ) గారికీ, శ్రీ పి. వెంకటరెడ్డి, శ్రీ పి. సహదేవరెడ్డి, శ్రీ మల్‌రెడ్డి. శ్రీ రామచంద్రా రెడ్డి, (గంగాపురంపల్లి) శ్రీ చంద్రారెడ్డి, (ఎల్. ఎమ్. బ్యాంకు, మదనపల్లి) శ్రీ రాయప్ప (P & T. నిమ్మనపల్లి) శ్రీ వెంకటముని స్వామినాయుడు (చిన్నబ్బ) న్యూకాలనీ, పాకాల పాకాల టెలిఫోను ఆఫీసు బృందము. శ్రీ కృష్ణమూర్తిరెడ్డి, సర్పంచ్. (దామల్ చెరువు) శ్రీ రామమూర్తిరెడ్డి, శ్రీ శాంతమూర్తిరెడ్డి (కోసంవారిపల్లి) గార్లకు నా కృతజ్ఞతలు.

నాలో ఆలోచనలు రేకెత్తించి, ఎంతగానో ప్రోత్సహించి, అభిమానంతో నన్ను ముంచెత్తి, సర్వదా నా శ్రేయస్సును కాంక్షించే మా బావగారు శ్రీ పి. వి. నరసింహం (ఎస్. వి. యూనివర్సిటీ, తిరుపతి) మా అక్కగారు శ్రీమతి కె. సుదర్శనమ్మ (టీచరు, తిరుచానూరు) నా ప్రియమిత్రులు శ్రీ వి. సత్యనారాయణమూర్తి (ఆర్. ఎం. యస్. మద్రాసు) శ్రీ ఆర్. సత్యనారాయణరావు, ఎం. ఏ) శార్ స్ట్రీట్, ట్రిప్లికేన్, మద్రాసు) శ్రీ K. భాస్కర్‌రెడ్డి, (టి. టి. ఇ. తిరుపతి) శ్రీ పి. సుదర్శనం (గార్డు, పాకాల) గార్లకు నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు.

ఈ పుస్తక రచనకు తోడ్పడిన నా ప్రాణమిత్రుడు శ్రీ వక్కంతం సూర్యనారాయణరావ్ (దా. సా. ప్రాజెక్టు, తి.తి.దే. తిరుపతి) గారికి కృతజ్ఞతలు. ముద్రణావిషయంలో సహకరించి, విక్టరీ ప్రెస్ వారిని పరిచయంచేసిన ప్రముఖ రచయిత శ్రీ కంది కొండ సూర్యనారాయణ శాస్త్రిగారికి ధన్యవాదాలు. మిత్రులు

శ్రీ ఆదోని వెంకోటరావు (తెలుగు పండిట్, బైరెడ్డిపల్లి) గారికి, శ్రీ వెంకటరెడ్డి (ఎస్. ఎం. క్లర్క్, పాకాల) గారికి, శ్రీ ఐ. వి. కృష్ణమూర్తి (ఎల్‌టి. టీచర్, టేఃపుర) గారికి నా కృతజ్ఞతలు.

సర్వకాల సర్వావస్థలలో నా మేలునే కోరుతూ, నన్ను ఆశీర్వదించే మా నాన్న శ్రీ కాంగో నారాయణరావ్‌గారికి, మా మామ శ్రీ బి. మోతీలాల్ (తెలుగు పండిట్, గుంటూరు) గారికి, మా అత్తగారు శ్రీమతి హనుమాయమ్మగారికి (గుంటూరు) మా మేనమామ శ్రీ వి. నాగరాజారావు (వి. కోట) గారికి నా నమస్కృతులు.

చేపట్టిన ప్రతి పనిలోనూ నాకు చేదోడు వాదోడుగా వున్న నా సహధర్మచారిణి లీలకు నేనెంతో ఋణపడి వున్నాను. అందంగా ముద్రించిన 'విక్టరీ ప్రెస్' వారికి నా ధన్యవాదాలు.

పాకాల, —విద్వాన్ కే. యన్. మురళీధర్.

27-10-1982

# భక్తకనకదాసు

అది కలియుగ వైకుంఠం. సాక్షాత్తు ప్రత్యక్ష స్వరూపుడైన శ్రీనివాసుడి నిలయం. బంగారు శిఖరాలతో, పచ్చటి తోటాలతో నిత్య నూతనంగా అలరారుతున్న తిరుమల క్షేత్రం. అది ప్రభాత సమయం. బాలభానుడు పూర్వ పర్వతాన్ని వీడి, త్వరితగతిని వినువీధికి చేరుకుంటు న్నాడు. బహుశః శేషాద్రివాసుడి సుప్రభాత దివ్యదర్శనార్థం కాబోలు ఆ పరుగు!

అప్పుడు యాత్రికులు కొందరు స్వామి పుష్కరిణిలో స్నానాలు చేస్తున్నారు. ఎంతో చలిగా వున్నా లెక్కచేయకుండా 'గోవిందా! గోవిందా!' అంటూ మునకలు వేస్తున్నారు. మరికొందరు భగవద్దర్శనాభి లాషతో బారులు తీర్చి వున్నారు. ఆలయంనుంచీ మంగళ వాయిద్యాలు విన్పిస్తోంది. గుడిగంటలు 'గోవిందా! – గోవిందా!' అంటున్నట్లు మ్రోగుతోన్నాయ్. విప్రవర్యుల వేదఘోషలతో స్వామి పూజాదికములు ఘనంగా జరుగుతోంది. యాత్రికులు ఇటూ అటూ తిరుగుతున్నారు. అంతటా సందడిగా వుండి స్వామి సన్నిధి సర్వదా కళకళలాడుతూ ఉంటుంది. ఆ ఆకర్షణశక్తి అలాంటిది.

ఆ సంధ్యాసమయంలో ఒక వీధి చివరనుంచీ మధురగానం శ్రోత లకు వీనులవిందు చేస్తోంది.

"శ్రీనివాస...నీనె...పాలిసో...
శ్రితజన పాల – గానలోం...
శ్రీవైకుంఠనే......"

అంటూ మైమరచి పాడుతూ ప్రాకార ప్రదక్షిణలు చేస్తున్నాడు 'వేంకటదాసు'. ఏకతార మీటుకొంటూ, చిటితలు వాయిస్తూ నడుస్తున్నాడు. అతడి పాట శ్రోతల హృదయాలలో భక్తిభావాలను నింపుతోంది. ప్రతినిత్యం ఈ సమయంలోనే అతను పాట పాడుకుంటూ వెళ్ళేవాడు. అది క్షేత్రవాసులకు మేలుకొలుపు లాంటిది. సుపరిచితమైన ఆ గొంతు వినగానే కొందరు అతడ్ని చూసి దైవదర్శనం అయినట్లుగా భావించి నమస్కరించేవారు. ఒకపాట తర్వాత మరొకటి పాడుకుంటూ వేంకటదాసు అడుగు లేస్తున్నాడు.

ప్రతినిత్యం సూర్యోదయాత్పూర్వమే లేచి – స్నానం చేసి, సంధ్య వార్చి – గాయత్రి జపించి – గుడిచుట్టూ ప్రదక్షిణలు చేయటం, ఎవరైనా ప్రీతితో పెట్టే భిక్షను స్వీకరించటం, సదా శ్రీహరి మహిమలను కీర్తిస్తూ కాలం వెళ్ళబుచ్చటం అతడి అలవాటు.

సాయంత్రం మండపంలో కూర్చొని పిన్నలకు, జనులకు – పురాణ కథలు చెప్పేవాడు. భజనలుచేస్తూ – అందరిచేత చేయిస్తూ, ఆనందించేవాడు. నిష్కామకర్మల నాచరించేవాడు. త్రికరణ శుద్ధితో భగవత్కార్యాసక్తుడై పవిత్రమైన మానవ జన్మను సార్ధకం చేసుకొంటున్న జీవన్ముక్తుడు వేంకటదాసు. శాంతము – సత్యము – భక్తి-జ్ఞాన వైరాగ్యములు మూర్తీభవించిన కారణజన్ముడు. ఈ కలియుగంలో ఇలాంటి మహనీయులు ఏ కొద్దిమందో వుంటారు.

ఆ రోజు సాయంత్రం వేంకటదాసు యథాప్రకారం మంటపంలో పద్మాసనం వేసుకొని కూర్చున్నాడు.

"వేంకటాచల నిలయం – వైకుంఠపురవాసం" అనే, అన్నమాచార్యుల కీర్తన పాడుకొంటున్నాడు. అక్కడికి సమీపంలో ఆటలాడు

కొంటున్న బాలలంతా దాసులవారిని చూడగానే పరుగు పరుగున వచ్చి చుట్టూ కూచున్నారు. దాసులవారి కథలంటే పిల్లలకు చాలా ఇష్టం !

వేంకటదాసు పిన్నలను చూసి చిఱునవ్వుతో 'బాలలూ ! మీకు శుభం కలుగుగాక ! శ్రీహరిగురువుల కరుణాకటాక్షం మీపై వుండు గాక !" అని నిండుగా దీవించాడు. తర్వాత

"రామ గోవింద హరె కృష్ణ గోవింద

దామోదర హరి విష్ణుముకుందా" అని పాట పాడాడు. అందరూ పాట నందుకున్నారు. అప్పుడు ప్రజలంతా ఒక్కొక్కరుగా వచ్చి కూర్చు న్నారు. భజన కార్యక్రమం పూర్తయింది దాసులవారు అందరివంకా తృప్తిగా చూశారు.

అప్పుడు మూర్తి అనే అబ్బాయి, 'దాసులవారూ ! మీరు చెప్పిన 'పురందర దాసు' కథ చాలా బాగుంది. అన్నిటికన్నా 'ప్రహ్లాదుడి కథ' నాకు బాగా నచ్చింది. మా అమ్మమ్మ రోజూ ప్రహ్లాదుడి పద్యాలు – అవే! పోతనగారి భాగవతంలోని పద్యాలు చెప్పమనేది. నే చెప్తూంటే విని ఎంత గానో సంబరపడిపోయేది" అన్నాడు.

"నాకు ఆంజనేయుడి కథ – గజేంద్రుడి కథ నచ్చాయండీ' – ఇంతకూ ఇప్పుడే కథ చెపుతారండీ ?" అడిగాడు వంశీ.

'దాసులవారూ ! నిన్నటి దినం దిగువ తిరుపతిలో శ్రీ రాఘవేంద్ర స్వాములవారి మఠంలో "భక్త కనకదాసు" హరికథ జరిగింది. కథ ఎంతో బాగుంది. కథకులు చాల చక్కగా పాటలు పాడుతూ – పిట్టకథలు చెప్తూ – కథను బాగా రక్తి గట్టించారు. విన్నవారంతా, 'కథ' చాలా బాగుందని తెగ మెచ్చుకున్నారు. కానీ నాకు మాత్రం సరిగా అర్థం కాలేదు. ఎందు

చేతనంటే, దాసులవారు కథను కన్నడభాషలో చెప్పారు గనుక !" అంది గాయత్రి.

అప్పుడు వేంకటదాసులు చిన్నగా నవ్వి, గాయత్రిని చూసి, 'అమ్మా ! ఇంతకుముందే కథ బాగుందన్నావు. అంటే ! కన్నడభాష నీకు తెలియకపోయినా కథ బాగా నచ్చిందన్నమాట. అదీ అంతే తల్లీ ! భగవత్సంబంధమైన కథల యొక్క వశీకరణశక్తి అలాంటిది. భాగవతోత్తముల కథలు నిత్యసత్యములు. అవి ఏ భాషకు చెందినవైనా పరమానందాన్ని కల్గిస్తుంది. ! తనువు పులకరిస్తుంది ! చెప్పేవారు చక్కగా చెప్పినప్పుడు వినేవారు శ్రద్ధతో వినాలి. అప్పుడే అనిర్వచనీయమైన ఆనందానుభూతి కలుగుతుంది. 'వినటం' వలన కలిగే లాభాలు అనేకం ! నవ విధ భక్తులలో తొలుత 'శ్రవణం' గురించే చెప్పారు.

"శ్రవణం కీర్తనం విష్ణోః । స్మరణం పాదసేవనం॥

అర్చనం వందనం దాస్యం । సఖ్యమాత్మ నివేదనం॥" అని శ్లోకం. పరీక్షిత్తు మహారాజు ఏడురోజులు భారత — భాగవత కథలు చిత్తశుద్ధితో విన్నందువల్లనే మోక్షాన్ని పొందాడు. స్త్రీ, బాల, వృద్ధులు, గుడ్డివారు, మూగవారు, చదువురానివారు భగవత్కథలను 'విని' పుణ్యం సంపాదించుకోవచ్చు. చదవటం — చెప్పటం — వ్రాయటంకన్నా 'వినటం' చాల సులభం. శ్రీహరి కథామృత సారమనే గ్రంథంలో 'శ్రవణం' యొక్క లాభాన్నిలా వర్ణించియున్నారు.

"శ్రవణ మనకానంద పీవుదు భవజనిత దుఃఖగళ కళెవుదు
వివిధ భోగగళిహపరంగళలిత్తు సలహువదు
భువన పావన వెనిప లక్ష్మీ ధవన మంగళ కథెయు పరమో
త్సవది కివిగొట్టాలిపుదు భూసురరు దినదినది."—



"శ్రీహరి కథలు వినడంవల్ల, మనసున ఆనందం కల్గుతుంది, భవ బంధాలు సడలిపోతుంది. ఇహపరాలలో సుఖశాంతులు కలుగుతుంది. కనుక మంగళకరములైన లక్ష్మీనాథుని దివ్యకథలను సత్కథలు చేసేయోగ్య శ్రద్ధతో ప్రతినిత్యం వినాలి" – అని పై పద్యానికి భావం.

పోతన - భాగవతంలో ఇలా పేర్కొన్నాడు :

"ఏ కథలయందు పుణ్యశ్లోకుడు హరి చెప్పబడు

నా కథలు పుణ్య కథలని 'యాకర్ణింపుదురు' పెద్ద లతిహర్షమునన్.

కనుక మనసు నిలిపి ఆనందంతో హరికథలను వినాలి.

"నిన్నటిదినం శ్రీ కనకదాసులవారి పుణ్యదినమట, కథకులు మైసూరు వాస్తవ్యులు. కనక నే కన్నడభాషలో చెప్పారు. మధ్యలో త్యాగయ్య, అన్నమయ్యల కీర్తనలను కూడ పాడి వినిపించారు." అన్నది గాయత్రి.

" 'దేశభాషలందు తెలుగు లెస్స' కదండీ ! ఆ కనకదాసుల వారి చరిత్రను మాకు తెలుగులో చెప్పండి !" అడిగాడు గోల్లకృష్ణుడు.

దాసులవారు తలవూపుతూ కథ చెప్పటాని కుద్యుక్తు లయ్యారు. "కనకదాసు" అంటే కనకమునకు (బంగారానికి) దాసులా? ఇతడికీ పేరెలా వచ్చింది?" ప్రశ్నించింది లీల.

" 'కనకదాసు' అంటే దాసులలో 'కనకం' లాంటివాడని అర్థం. దాసశ్రేష్ఠుడన్నమాట. అంతే గదండి!" అన్నాడు ప్రసాద్.

బాలల ఊహలకు వేంకటదాసు పొంగిపోయాడు. అందరి వంకా చిఱునవ్వుతో చూస్తూ, "బాలలూ! మీలో ఊహాశక్తి బాగా అభివృద్ధి చెందింది. భాగవతోత్తముల కథలు భక్తితో చదవటం, వినటం వలన బుద్ధి

వికసిస్తుంది జన్మ తరిస్తుంది। భావిభారత పౌరులైన, మీరు సజ్జనుల కథలు విని మన హైందవ జాతి గౌరవ మర్యాదలను నిలపాలి."

"దాసులవారూ। మొన్న వేసవి శెలవుల్లో నేను గుంటూ రెళ్ళానండీ. మీరు చెప్పిన కథలను మా అమ్మమ్మకు, తాతయ్యకు చెప్పానండి। చుట్టాలంతా నేచెప్పిన కథలు విన్నారు. అసలు వారికి పురందరదాసు, వ్యాసరాయల కథలు బొత్తిగా తెలియదు. నేను కొన్ని కీర్తనలు పాడి విని పించాను. పిన్నలంతా కలిసి భజనలు కూడా చేశాము. అందరూ నన్ను తెగమెచ్చుకున్నారు" అన్నాడు ప్రసాద్.

"మంచిది నాయనా। బాలలైన మీద్వారా ఇలాంటి పుణ్య కథలు వ్యాప్తిచెందనీ. ఇహపర సాధకములైన హరి కథలను వినటం, చదవటం, చెప్పటం పూర్వజన్మ సుకృతమున్న వారికే తగినది. కానీ వీటిలోని ధర్మా లను సాధ్యమైనంత వరకూ ఆచరణలో చూపాలి. ఆచరణలోలేని వేదాంత జ్ఞానం వల్ల ప్రయోజనం శూన్యం. ఇక మనం "కనకదాసు" కథను చెప్పు కుందాం।" అంటూ కథను ప్రారంభించారు దాసులవారు :

"శ్రీ గురుభ్యోనమః—హరిః ఓం"

శ్లో॥ జయతి శ్రీరమానాథః । సంపూర్ణామిత సద్గుణః॥
యదధీనమిదం సర్వ। మస్వతంత్రం సదైవహి॥

"నాయనలారా। భగవంతుడు ఒకజాతికి, ఒక మతానికి, ఒక ప్రాంతానికి, ఒక భాషకు పరిమితమైనవాడు కాడు. అతడికి దేశకాలావధులు లేవు. జీవులనందరినీ సమభావంతో చూస్తాడు. ఎవరెవరి కర్మలకు తగిన ఫలితాలను వారికిస్తాడు. అతడికి ఎవరిపైనా ద్వేషంలేదు. భగవద్గీతలో సమ నామక పరమాత్ముడిలా చెప్పాడు.

శ్లో॥ "విద్యా వినయ సంపన్నే। బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః॥"

అంటే - "పండితుడైనవాడు, విద్యావినయ సంపన్నుడగు బ్రాహ్మ ణుని యందును, కుక్క మాంసమును తినెడి చండాలుని యందును, గోవు, కుక్క, ఏనుగు మున్నగు జంతువుల యందును సమదృష్టి గలిగి వుంటాడు. ఇది తెలిసిన వాడే జ్ఞాని. వాడు జగమెరిగిన పండితుడు."

మన కథానాయకుడైన కనకదాసు గొల్లకులంలో జన్మించినవాడు. అంతమాత్రంచేత ఇతడిలో సద్గుణములు, దైవభక్తి లేకపోలేదు. భగవద్భ క్తులు ఏకులంలో, ఎప్పుడెక్కడ పుడతారో మానవ మాత్రుల ఊహలకు కూడ అందదు. కనకదాసు కర్ణాటక ప్రాంతంలోనివాడు కనుక అతడి రచనలను,కన్నడ పాటలను, పద్యాలను, సందర్భానుకూలంగా పేర్కొంటూ, అర్థ తాత్పర్యాలను వివరిస్తూ కథ చెపుతాను.

కర్మభూమియైన మన భారతదేశంలో ఎందరో కారణ జన్ము లవ తరించారు. తాము తరిస్తూ, ఇతరులను తరింపజేస్తూ జీవన్ముక్తులై భాసించారు. భక్తిభావాలతో భగవంతుడ్ని అర్చించి, సేవించారు. విశ్వశ్రేయస్సును కోరి భాగవత ధర్మాల నాచరించిన పూతాత్ములు వీరు. వీరి చర్యలు లోకానికి చాలా విడ్డూరంగా ఉన్నా, భగవత్సంకల్పానికి లొంగి వుంటాయి. వీరి మహిమలు సత్యసమ్మతములు. ఇలాంటి మహనీయుల చరిత్రలను చర్విత చర్వణం చేసికోవటం, ఇహపర సాధకం. వీరి కథలు ఎంతటి ప్రాచీనములైనా జీవం ఉట్టి పడుతూ నిత్యనూతనంగా వుంటాయి. ఇటువంటి మహాత్ముల కోవకు చెందినవాడు కనకదాసు."

బాలలంతా దాసులవారిని తదేకంగా చూస్తున్నారు. తీర్చిదిద్దిన శ్రీ చందనపు బొట్టుతో ముఖం దివ్యతేజస్సుతో ప్రకాశిస్తోంది. చేతిలో చిటితలు, తంబూర, ప్రక్కన గోపాల బుట్టి వున్నాయి. అతని కంఠం

కంచులా ధ్వనిస్తోంది. నిరాడంబరమైన వేషంతో, ఋషి పుంగవుడిలా కన్పిస్తున్నాడు. శాంత గంభీరమైన అతడి ఆకారంలో విచిత్రమైన వశీకరణ శక్తివుంది. సాక్షాత్తు ఆ దేవుడే తమకు కథలు చెప్పడానికి ఈ రూపంలో వచ్చాడేమోనని అనిపిస్తోంది. బాలలంతా చేతులు జోడించి, విధేయులై దాసులవారు చెప్పేది వింటున్నారు.

"కనకదాసు కర్ణాటక రాష్ట్రంలోని ధార్వాడజిల్లా "బాడ" అనే గ్రామంలో బీరప్ప, బచ్చమ్మలనే పుణ్య దంపతులకు కల్గిన ఏకైక సంతానం. దుడుకు చేష్టలతో బాల్యం గడచి పోయింది. చదువు విషయంలో అపుడు శ్రద్ధచూపలేదు. యుక్త వయసులో యుద్ధ విద్యలు నేర్చాడు. తండ్రి గతించిన తర్వాత వంశానుగతంగా వచ్చిన "గ్రామాధికారి" వృత్తిని స్వీకరించాడు. అనుకోకుండా లభ్యమైన సంపదను ధర్మకార్యాలకు వినియోగించాడు. భగవదనుగ్రహంతో సర్వాన్ని పరిత్యజించి "దాస" దీక్షను చేపట్టాడు. సద్గురు సేవలతో, సజ్జన సావాసంతో, పుణ్యతీర్థ-క్షేత్ర సందర్శనలతో తన జీవితాన్ని పునీతం చేసికున్నాడు. శ్రీహరి కృపచే అలవడిన కవితాశక్తితో పెక్కు కీర్తనలు రచించాడు. అజ్ఞానంతో, మూఢాచారాలతో పతనమైపోతున్న ప్రజలకు జ్ఞానోపదేశం చేశాడు. ధన్యజీవియై భాసించాడు.

కనకదాసు పుట్టుకకు హేతువైన జన్మ రహస్యం ఒకటుంది. ఇతను యమాంశ సంభూతుడు. ధర్మస్వరూపుడైన యమధర్మరాజే ఇలా అవతరించాడు. దేవతలు మనుష్యులుగా జన్మించడానికి వెనుక ఏదో బలవత్తరమైన దైవీ రహస్యం దాగుంటుంది.

"బాలలూ! మీరు యమధర్మరాజు పేరు వినేవుంటారు కదూ?"

"అమ్మబాబోయ్! యముడా! పాశం వేసి అందరి ప్రాణాలూ తీస్తాడట! పాపాలు చేసిన వారిని నరకంలో పడేసి కఠినంగా శిక్షిస్తాడట! మాబామ్మ చెప్పింది" భీతితో అన్నాడు రాను.

"అవును మరి! సలసలాకాగే నూనెలో పడేస్తాడు! అంపంతో కరకర కోసేస్తాడు! నేను "సతీసావిత్రి" సినిమాలో నరకలోకాన్ని చూశాను" అంది గాయత్రి.

ఇది విన్నవారంతా ఘొల్లుమని నవ్వారు. అప్పుడు వేంకటదాసు 'ఎందుకలా భయపడటం! యమధర్మరాజు ధర్మమూర్తి. నీతిగలవారిని, సజ్జనులను, భగవద్భక్తులను అతడు చల్లగా చూస్తాడు. నీచులను, దుర్జనులను, పాపులను కఠినంగా శిక్షిస్తాడు. ధర్మాధర్మాలను నిర్ణయించేవా డితడు. కర్మసాక్షియైన సూర్యదేవుని పుత్రుడు.

ఇతడికి రెండు ముఖా లున్నాయి. ఒకటి 'ధర్మము' — రెండవది 'యమము'. ధర్మమనే ముఖంతో శిష్టులను కరుణతో చూస్తాడు. యమ మనే ముఖంతో దుష్టులను తీక్షణంగా చూసి, కఠినంగా దండిస్తాడు.

మహాభారతంలోని 'విదురుడు–ధర్మరాజు' యమాంశతో జన్మించినవారు. అందుకే ధర్మమూర్తులై, సత్యము, సహనము, శాంతము మున్నగు గుణములు గలిగి కీర్తి కాముకులయ్యారు.

'విదురనీతులు' అనే పాఠం మా తెలుగు వాచకంలో వున్నదండీ! మా తెలుగు మాష్టారు కమ్మగా పద్యాలు పాడి, చక్కగా పాఠాన్ని చెప్పారు.' అంది గాయత్రి.

" "శాంతిసందేశం" అనే పాఠంలో ధర్మరాజు శ్రీకృష్ణుడ్ని రాయబారానికి పంపుతూ చెప్పిన విషయాలు ఎంతో బాగున్నాయండి" అన్నాడు ప్రసాద్.

"ఏదమ్మా! 'విదురనీతులు' పాఠంలోని, ఒక పద్యం చెప్పు చూద్దాం!" అడిగారు దాసులు. గాయత్రి వెంటనే ఇలా చెప్పింది :

"ఒరులేయవి యొనరించిన
నరవర ! యప్రియము తన మనంబునకుఁ దా
నొరులకు నవి చేయకునికి
పరాయణము ధర్మపథముల కెల్లన్ !"

'భేష్ ! మాంచి పద్యం చెప్పావు. దీని భావమేమంటే "ఇతరులు ఏ కార్యం చేయటంవల్ల మన మనసుకు బాధ కలుగుతుందో-అలాంటి పనిని మనం కూడా ఎదుటివారి విషయంలో చేయరాదు-అలా వుండటమే శ్రేష్ఠమైన ధర్మం-"

చూశారా ! విదురనీతి ఎంత గొప్పగా వుందో ! తక్కువ కులంలో జన్మించినా మహనీయులు మహనీయులే ! విదురుడు శాంతము, సత్యము, ధర్మము, దయ, ప్రేమ మున్నగు గుణాలతో వెలుగొందిన పావనమూర్తి. కౌరవులతో రాయబారం సలిపిన తర్వాత కృష్ణుడు విదురు నింటికే విందు కోసం వెళ్ళాడు. ఇక పాండవాగ్రజుడైన ధర్మరాజు కథ అందరికీ తెలిసిందే ! ఇలా యమాంశ సంభూతులైన వీరిరువురిలాగా కనకదాసు కూడ జన్మించాడు.

కనకదాసు కథ కర్ణాటక రాష్ట్రంలో చాలా ప్రసిద్ధి గాంచింది. ఇతడి తండ్రి బీరప్ప, పాలెగాడు. అంటే కొన్ని గ్రామాల కధికారి. ప్రజలనుంచీ పన్నులు వసూలుచేసి మహారాజుగారి ఖజానాలో జమకట్టడం, శత్రురాజులు తమ రాజ్యంపైకి యుద్ధానికి వచ్చినపుడు, తమ యేలుబడిలో వున్న సైన్యంతో, రాజుకు తోడ్పడి యుద్ధం చేయటం పాలెగాళ్ళ పని. బీరప్ప గొప్ప ప్రభుభక్తి పరాయణుడు. మంచి నాయకుడు. విధి నిర్వహణలో జాగరూకత కలవాడు.

ఎవరు తమ విద్యుక్త ధర్మాలను చక్కగా ఆచరిస్తారో, వారికి సమాజంలో సముచిత స్థానం వుంటుంది. అటు ప్రభుత్వాధికారులలోనూ,

ఇటు ప్రజలలోను మంచి పేరు వుంటుంది. వ్యక్తిగతానందం సరేసరి. శ్రీకృష్ణుడు గీతలో 'నియతం కురు కర్మత్వం'-అన్నాడు. నీకు నియమింపబడ్డ కార్యాలను నీవు ఆచరించు అంగ్ల పండితుడొకడు.

"Do your duty. 'DUTY IS GOD'; who ever thinks like this, will not have any weakness in his mind"-అని విద్యుక్తధర్మాన్ని భగవత్స్వరూపంగా వర్ణించాడు.

రాజకీయము, లోక వ్యవహారము—వీటితోపాటు పూజలు, పునస్కారాలు, దైవ చింత, వ్రతాలు మున్నగు విషయాలలో బీరప్ప ఆసక్తి చూపేవాడు. దానధర్మాలు చేస్తూ అతిథి అభ్యాగతుల నాదరిస్తూ వుండేవాడు. దేశ కాలానుగుణంగా వర్తించిన వారు సాధించలేనిదంటూ వుండదు! ఇతడికి అన్నివిధాలా అనుకూలవతి యైనది బక్కమ్మ. భర్త భావాలకు తగిన భార్య లభించటం పూర్వజన్మ సుకృతం!

భోగభాగ్యాలు-గౌరవ మర్యాదలు అన్నీవున్నా, ఈ దంపతులకు సంతానం మాత్రం లేకుండా పోయింది. నోములు - వ్రతాలు అన్నీ చేశారు. ఫలితం శూన్యం. పున్నామ నరకంనుంచి తమను తప్పించే పుత్రుడు లేక పోయాడే! అన్న వేదన ఎక్కువైంది.

ఒకసారి బీరప్ప తిరుమలయాత్ర చేశాడు. శ్రీనివాసుడి దివ్యదర్శనం చేసుకున్నాడు. వంశోద్ధారకుడైన పుత్రుడ్ని ప్రసాదించమని ప్రార్థించాడు. కులదీపకుడు పుడితే తిరుమలేశుని పేరు పెట్టుకుంటానని మొక్కుకున్నాడు. తన మనోవ్యధను స్వామి సన్నిధిలో ఏకరువు పెట్టుకున్నాడు. అతడిపై భారంవేసి మరలి వచ్చాడు.

"కలౌ వేంకటనాయకః" అన్నారు. కలియుగంలో శేషశైలపతికి మించిన దేవుడు లేడు. భక్తుల ఇష్టాలను తీర్చుటయే ముఖ్య కర్తవ్యంగా పెట్టుకున్న శ్రీనివాసుడు ప్రత్యక్ష స్వరూపుడు. నమ్మి కొలిచిన వారికి

తీరని కోర్కెలంటూ వుండవు. కైవల్య స్థానాన్ని వదలి లక్ష్మీసమేతుడై భూలోకానికి విచ్చేసిన స్వామికి, తన భక్తులను కాపాడటమే ప్రధానకార్యం.' అంటూ వేంకటదాసు ఉద్వేగంతో పురందరదాసు కీర్తనను పాడారు.

"బందు నింతిహనోడి - భూతళది వేంకట
ఇందిరెయ ఒడగూడి — ఒప్పువ నిరంతర
హొంది భజనెయమాడి - అనందబేడి

.....................................

ఎల్లభకుతర భీష్ట - కొడువదకె తా కై
వల్య స్థానవ బిట్ట - శేషాద్రి మందిర
దల్లి లోలుప దిట్ట - సౌభాగ్య నిధిగెదు
రిల్ల భుజబల - పుష్ట - కస్తూరి యిట్ట........."

సురవృందములచే, నుతింపబడు శ్రీనివాసుని నమ్మి కొలిచేవారే ధన్యులు. భక్తితో ప్రార్థిస్తే, భగవంతుడు పలుకుతాడు.

'నేను పదవతరగతి ఫస్టుక్లాసులో ప్యాసయితే ఏడుకొండలవాడికి ఏడు కొబ్బరికాయలు కొట్టి, గుండు చేయించుకుంటాను' అన్నాడు రవి.

'నాకు లాటరీలో లక్షలువస్తే ఏడువందలు హుండీలోవేసి, కాలి నడకన కొండ ఎక్కి దిగుతాను' అన్నది గాయత్రి.

'నేను మంత్రి నవ్వాలి. పెద్ద మేడ కట్టుకోవాలి, కారులో తిరగాలి. ప్రజాసేవలు చేసి డబ్బు సంపాదించాలి, అప్పుడు కల్యాణోత్సవం జరిపిస్తాను, అన్నదానం చేస్తాను' అన్నాడు కృష్ణుడు.

బాలలంతా తాము డాక్టర్లు, యాక్టర్లు, కలెక్టర్లుగా కావాలని అను కుంటూ, తమ మనసులకు తోచినట్లు కోరుకుంటూ మొక్కులు చెల్లిస్తా

మంటుంటే దాసుగారు పకపకా నవ్వి, 'చదివకనే ఓ దేవుడా ! నన్ను ఫస్టు క్లాసులో ప్యాసు చేయమంటే లాభముండదు. శ్రద్ధతో, స్పర్థతో చదవాలి. 'శ్రద్ధయా వర్ధతే విద్యా' అన్నారు. క్రమశిక్షణతో చదవాలి. మానవ ప్రయత్నమంతూ గట్టిగా చేసి, ఆ తర్వాత భగవంతుడ్ని మ్రొక్కుకోవాలి. అంతేగాని మాటలతో పని జరుగదు.

"ఒట్టి మాటలు కట్టి పెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్" - అన్న మాటలను
చక్కగా అర్థం చేసికొని ఆచరించాలి.

కేవలం స్వార్థ ప్రయోజనాల నాశించి భగవంతుడ్ని మ్రొక్కుకోవటం అవివేకం. కొందరు చీటికి మాటికి దేవుడ్ని ప్రార్థిస్తారు. పని కాగానే వాడిని తలంచరు. మరికొందరు అతి భక్తిని ప్రదర్శించి ఆత్మ వంచనలు చేసికుంటారు. పూజలు, జపాలు, తపాలు చేస్తూ లోకం దృష్టిలో మహాభక్తులుగా కన్పిస్తారు. తిలకము, బొట్టు, విభూతిని పెట్టుకుని ఆడం బరంగా, అహంకారంతో సంచరిస్తారు. ప్రపంచమంతా తమకు వశమైనట్లు భావిస్తారు. తరుచూ వేదాంతోపన్యాసాలు దంచేస్తారు. భజనలు చేస్తూ ప్రజల నాకర్షించి, మహాసాధువుల్లాగా చెలామణి అవుతారు. ఆ దేవదేవుడు తమ జేబుల్లో వున్నట్లు తలుస్తారు. స్వార్థం, కపటం, అసత్యం, పదవీ వ్యామోహం కీర్తికండూతి, మిత్రద్రోహం, వంచన మున్నగు గుణాలు వీరిలో నిండి వుంటాయి. ఇంతకన్నా మించిన ఆత్మవంచన మరొకటి లేదు. ఈ కలి యుగంలో ఇలాంటి దొంగభక్తులకు, కపట సన్యాసులకు, ఇంద్రజాలం చూపేవారికి విలువ ఎక్కువ ప్రజలను పెడత్రోవలు పట్టించే ఇలాంటివారు రౌరవాది నరకాలను అనుభవించక తప్పదు.

ఆత్మశుద్ధిలేని ఆచారా లెందుకు ? చిత్తశుద్ధిలేని శివపూజలేల?...నిజ మైన భగవద్భక్తి కలవాడు ప్రతి చిన్నపని చేయటానికి మీనమేషాలు లెక్క

పెట్టడు. అన్నింటికీ దేవుణ్ని ముడిపెట్టడు. తన ప్రయత్నం తాను చేసి, తత్ఫలితాలను దేవునికే వదిలేస్తాడు. మంచి జరిగినా, చెడు జరిగినా భగవంతుడి ఇష్టాయిష్టాలకు లోనై జరిగిందని తలుస్తాడు. స్వార్థానికి లోనుకాడు. అహంకార మమకారాలకు తలవంచడు. సుఖదుఃఖాల ద్వంద్వాల కతీతుడై వుంటాడు. సమస్త ప్రాణుల పట్లా కరుణ గలిగి, త్రికరణ శుద్ధితో, భగవంతుడిపై సంపూర్ణ విశ్వాసంతో, తన కర్మలను ఆచరిస్తాడు. శాంతము, సత్యము, శౌచము, అహింస, క్షమ, ఆత్మవిశ్వాసము, అనన్యభక్తి, జ్ఞాన, వైరాగ్యాలనే తపో లక్షణాలతో పరిపూర్ణుడై వుంటాడు. భవబంధాలకు, అరిషడ్వర్గాలకు—కట్టుపడడు, లొంగడు. తాను చేసే ప్రతి పనీ 'శ్రీ కృష్ణార్పణమ'ని భావిస్తాడు. 'నాహం కర్తా—హరిః కర్తా' అనుకొంటాడు. జీవన్ముక్తుడై భాసిస్తాడు.

లోకంలో ఇలాంటి సాత్విక జీవులు ఏ కొద్దిమందో వుంటారు. తమకు ఫలానా వస్తువులు కావాలని దేవుడికి మొక్కులు చెల్లించాల్సిన అవసరం లేకుండా, వాడిచ్చినదే భాగ్యమని భావిస్తూ, తృప్తిగా జీవిస్తారు. ఒకవేళ ఏదైనా కార్యం కావాల్సివస్తే, వెంటనే భగవంతుడి అనుగ్రహంతో అది నెరవేరుతుంది.

భగవంతుడు కూడ తన భక్తుల అవసరాలను కనిపెట్టుంటాడు. ఎవరెవరికి, ఎప్పుడెప్పుడు, ఏది కావాలో భగవంతుడికి బాగా తెలుసు. ఎవరూ అడగాల్సిన పని లేకుండా వారికావల్సిన వాటిని తానే ఇస్తాడు. గీతలో పరమాత్మ ఇలా చెప్పాడు.

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం।
యేజనాః పర్యుపాసతే॥
తేషాం నిత్యాభియుక్తానాం।
యోగక్షేమం వహామ్యహం॥

'ఎవరు ఇతర చింతలు మాని, అనన్య భక్తితో, నన్ను స్మరిస్తూ, ఉపాసింతురో, అట్టి నిత్యయోగనిష్ఠులయొక్క యోగక్షేమములను నేనే భరిస్తాను'.

కనుక అత్యాశలకు పోకండి. వెర్రిమొర్రి కోర్కెలు కోరవద్దు. భ్రమలో పడవద్దు. హెచ్చరికతో, బుద్ధిగలిగి వుండండి." అని దాసులవారు అందరినీ మందలించారు.

బీరప్ప తఱచుగా తిరుమలకు వెళ్ళి వచ్చేవాడు. సదా శ్రీనివాసుడినే స్మరిస్తూండేవాడు. ఆతడినే విశ్వసించాడు. ఇలా కొంతకాలం గడిచింది. భగవంతుడు బీరప్ప కోరికను మన్నించాడు ఆ దంపతుల మొరాలకించాడు. వారి పుణ్యం పండింది. బీరప్ప భార్య గర్భం దాల్చింది. ఒక శుభముహూర్తంలో వంశోద్ధారకుడైన పుత్రుడు పుట్టాడు. ఆ దంపతుల ఆనందానికి అవధుల్లేవు. పుట్టినరోజు పండుగను చాలా ఘనంగా చేశారు. అన్నదానం చేశారు. బంధుమిత్రులతో ఇల్లంతా కళకళలాడింది.

పుట్టిన బిడ్డకు 'తిమ్మప్ప' అని నామకరణం చేశారు. శ్రీనివాసుడి అనుగ్రహంతో కలిగాడు కదా! కనుక 'తిరుమల-అప్ప' తిమ్మప్పగా పేరు స్థిరపడింది. లేక లేక కల్గిన కుమారుడ్ని ఎంతో మురిపెంగా పెంచుకున్నారు.

'పువ్వుపుట్టగానే పరిమళిస్తుంది.' అన్నట్లు, తిమ్మప్ప మాంచి తెలివి తేటలతో, చురుకుదనంతో అందరి దృష్టినీ ఆకర్షించాడు. తగిన తరుణంలో వాడికి అక్షరాభ్యాసం జరిగింది. కానీ వాడికి విద్య సరిగా అబ్బలేదు. గారాబంతో తల్లిదండ్రులు పెంచడం వల్ల చదువు సంధ్యలలో తిమ్మప్ప వెనుకపడిపోయాడు. దుడుకుచేష్టలుచేస్తూ అల్లరిపిల్లవాడుగాతయారయ్యాడు. ఎప్పుడూ కొంటె కుర్రాళ్ళతో తిరుగుతూ, వారికి నాయకుడై, ఇతరులతో

పోట్లాటలు పెట్టుకొనేవాడు. కానీ గుడులు — గోపురాలు — పూజలు మొదలైన దైవకార్యాల జోలికి మాత్రం పోలేదు.

తిమ్మప్ప ప్రవర్తన తల్లిదండ్రులకు ఆందోళన కల్గించింది. నయాన, భయాన చెప్పి చూశారు. కానీ లాభంలేకుండా పోయింది. గ్రామ ప్రజలను అదుపాజ్ఞల్లో పెట్టుకున్న బీరప్ప కన్నకొడుకును క్రమశిక్షణతో పెంచలేక పోయాడు. లోకంలో ఇలాంటి సంఘటనలు సర్వసాధారణంగా జరుగుతూం టుంది.

కట్టుదిట్టంగా బడిపిల్లలకు చదువులు చెప్పే ఉపాధ్యాయులు తమ బిడ్డల్ని అదుపులో పెట్టలేరు. ఎందరికో పెళ్ళిళ్ళు జరిపించే పురోహితుడు తన బిడ్డలకు పెళ్ళి చేయించలేకపోతాడు. లోకాన్నుద్ధరించే వాళ్ళు తమ కుటుంబాన్ని సంస్కరించుకోలేకపోతారు. "పండిత పుత్రాః శుంఠా" అనే నానుడి నిజమే మరి!

చాలామంది తల్లిదండ్రులు తమ బిడ్డల్ని అదుపాజ్ఞలలో పెట్టటం లేదు. ఇంట్లో అల్లరి చేస్తుంటారని పిల్లల్ని బడికి పంపి హాయిగా వుంటారు. బడిలో ఉపాధ్యాయుడు కష్టనష్టాలను భరించాల్సిందే పాపం! బిడ్డలు అభి వృద్ధి చెందటానికీ, నాశనమవటానికి తల్లిదండ్రులే ముఖ్యకారకులు. ప్రేమానురాగాలతోబాటు, క్రమశిక్షణతో బిడ్డల్ని పెంచాలి. అప్పుడే వాళ్ళు ప్రయోజకులౌతారు. పెద్దలపట్ల, గురువులపట్ల వినయ విధేయతలు కలిగి వుంటారు. 'మొక్కై వంగనిది — మ్రానై వంగదు' — కనుక పిల్లల్ని జాగ్ర త్తగా గమనిస్తూ వుండాలి. వాళ్ళ అభిరుచుల్ని గుర్తించి దానికి తగిన విద్యలు నేర్పాలి.

తిమ్మప్పకు యుక్తవయసువచ్చింది. అతనిచదువు కేవలం వ్రాయటంచద వటం వరకే పరిమితమైపోయింది కానీ గుఱ్ఱపుస్వారీ, కఱ్ఱసాము, కత్తియుద్ధం మున్నగు యుద్ధవిద్యలను ఆసక్తితో నేర్చాడు. తండ్రి, తనయుడి అభీష్టం

ప్రకారం సాంగ్రామిక విద్యలను తానే స్వయంగా నేర్పుతూ వచ్చాడు. వీటితోబాటు చదువుసంధ్యలు కూడా వుండాలని ఎంతగా చెప్పినా అతడి బుర్రకెక్కలేదు. పిన్నలు ఎంత అల్లరి చిల్లరి పనులు చేసినా, చదువులో చక్కగా వుంటే అంతే చాలు. వారి అల్లరిని ఎవ్వరూ లెక్కపెట్టరు. అదే చదువు లేకుండా వుంటే - లోకం నిందిస్తుంది

తిమ్మప్ప తండ్రి మాటలను పెడచెవిని పెట్టి, యుద్ధవిద్యలనే నేర్చాడు. 'లోకోభిన్న రుచిః' అన్నట్లు ఎవరి అభిరుచులు వాళ్ళవి! మీరు కూడ డాక్టర్ కావాలని ఒకరంటే, కలెక్టర్ కావాలని మరొకరన్నారు కదా

'నిజమేనండి! నేను గొప్ప క్రికెట్ ప్లేయర్నై కపిల్‌దేవ్‌లా పేరు తెచ్చుకోవాలి.' అన్నాడు ప్రసాద్.

"నేను పెద్ద మిలిటరీ ఆఫీసర్నై, యుద్ధంలో శత్రువులను తుపాకీతో కాల్చి చంపేస్తాను" అన్నాడు వంశీ.

చూశారా! అప్పుడే మొదలెట్టారు అంటూ నవ్వుతూ దాసులవారు కథ నందుకున్నారు.

యుద్ధవిద్యలు నేర్చిన తిమ్మప్ప గొప్ప వీరుడై, తన ఈడువారిని మించిపోయాడు. వీరులకథలు వినటం, సాహసకార్యాలు చేయటం తిమ్మప్పకు చాలా ఇష్టం. తాను మహావీరుడై పోవాలని ఉబలాటపడేవాడు. తల్లిమాత్రం తరుచుగా కుమారుణ్ణి మందలించేది. రోజూ దేవుణ్ణి ఒకసారైనా పూజించ మనేది. చదువుపట్ల శ్రద్ధ చూపమనేది అయినా లాభం లేకుండాపోయింది. బాల్యంలో అలవడని భగవద్భక్తి, సద్విద్యలు అతడికి భవిష్యత్తులో శాశ్వ తంగా ఏర్పడాలన్నది భగవత్సంకల్పం కాబోలు!

"తెలియదో నిన్నాట - తిరుపతి వెంకటరమణా!" అంటూ వెంకట దాసు పాట పాడారు.

ఇలాంటి తిమ్మప్ప ముందుముందు ఎలా మారిపోతాడో ఆ భగవంతు డికే ఎరుక! వాడి ఆటలు మానవ మాత్రుల కెలా తెలుస్తుంది?

తిమ్మప్ప రోజూ క్రమం తప్పక వ్యాయామం చేసేవాడు. కండలు తిరిగిన శరీరంతో, చాలా గంభీరంగా, దుర్మార్గులకు భయాన్ని కల్గించే విధంగా వున్నాడు. అసలే అజానుబాహుడు. అతడి పట్టుదల-పరాక్రమం అంతా చూస్తే నాయకత్వ లక్షణా లతడిలో కొట్టవచ్చినట్లు కన్పిస్తోంది.

"శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్"ని ఆర్యోక్తి. శరీరం గట్టిగా, ఆరోగ్యంగా వుంటే, ఎన్నో ధర్మకార్యాలు సాహసకృత్యాలు చేయొచ్చు! ఆపదల్లో వున్న వారిని ఆదుకోవాలన్నా, క్రూరమృగాలను వేటాడాలన్నా, గొప్ప కార్యాలను సాధించాలన్నా, జపతపాదు లాచరించాలన్నా 'శరీరం' దృఢంగా వుండాలి శారీరక బలం లేకుంటే మానసికంగానూ మనిషి ఎదగ లేడు. శారీరక మానసికారోగ్యాలు బాగా వున్న వారు సాధించని కార్యాలంటూ వుండవు.

మన హిందూ సంస్కృతి చాలా గొప్పది. శారీరక మానసిక పటిష్ట తకు పలసిన వివిధోపాయాలు మన ప్రాచీన గ్రంథాల్లో చాలా వున్నాయి. సూర్యనమస్కారాలు – ఆసనాలు – ప్రాణాయామము – యోగవిధానము– వ్యాయామము మొదలగునవి. వీటిని క్రమం తప్పక ఆచరిస్తే బుద్ధిబలము – భుజబలము – ఇంద్రియనిగ్రహము – వీర్యపుష్టి – తేజస్సు – ఆత్మవిశ్వా సము – వృద్ధి చెందుతుంది. ప్రకృతి శక్తులు కూడ తలవొగ్గుతుంది.

'నిజమేనండీ! అందుకే మా అన్నయ్యలు ప్రతిరోజూ 'కరాటే ఫైటింగ్' నేర్చుకొంటున్నారు. వీళ్ళ జోలికి ఎవరైనా వస్తే చిత్తు చిత్తుగా తన్నిపారేస్తారు.' అన్నాడు రాము.

'మొన్న మా వీధివాళ్ళు - దిగువ వీధివాళ్ళు పోట్లాడుకున్నారు – మా వీధి కరాటే కుర్రాళ్ళు నలుగురు నిలబడి ఆ వీధి వాళ్ళను ఉతికి పారే శారు.' అన్నాడు ప్రసాద్.

తప్పు నాయనా! ఇతరులను హింసించే శారీరక బలం మంచిదికాదు పరోపకారం చేయగల శక్తియుక్తులే ఉన్నతములైనవి. అది లేనపుడు 'సాము నేర్చుట చావు కొఱకే' అన్నది నిజమౌతుంది. అహంకారము - ద్వేషము-మత్సరము - మతకలహాలను పెంచే శారీరక బలం సర్వనాశనానికి మూలం. ఇలాంటివారు అడ్డగాడిదల్లా తిరుగుతూ, అనవసరంగా పరులను పీడిస్తూ, కన్నూమిన్నూ గానక ప్రవర్తిస్తూంటారు. ఎప్పుడో ఒకప్పుడు వీళ్ళకు గర్వభంగమవుతుంది. 'తాడిదన్నేవాడి తలదన్నేవాడు మరొకడుంటాడు.'

తిమ్మప్ప ప్రవర్తన తండ్రికి విచారం కల్గించింది. కాలానుగుణంగా కొడుకులో మార్పు వస్తుందని ఆశించాడు ఏడుకొండలవాడి వరప్రసాదమైన బిడ్డ, తప్పక ప్రయోజకుడౌతాడనీ, తన వంశ గౌరవాన్ని కాపాడతాడనీ విశ్వశించాడు. బీరప్ప అంటే గౌరవమున్న ప్రజలు తిమ్మప్ప విషయంలో ఏవగించుకొనక కుర్రతనపు చేష్టలుగా భావించారు.

తిమ్మప్ప మిత్రులతో కలసి తరుచూ వేటాడేందుకు అడవులకు వెళ్ళేవాడు. క్రూరమృగాలతో పోరాడేవాడు. బాణం సంధించితే గురి తప్పదు. ఇతడి మాట ప్రకారం జరిగేది కూడా! తిమ్మప్ప క్రూరమృగాల విషయంలో ఎంత కఠినుడో సాధు జంతువులపట్ల అంత దయార్ద్ర హృదయుడు. మిత్రులు పొరబాటుగా కుందేళ్ళను, జింకలను చంపితే చాలా వ్యధ చెందేవాడు. "ఎందుకీ మృగయావినోదం - దీనికన్నా సన్యాసం మంచిది కదా!" అనేవాడు.

ఒకరోజు హఠాత్తుగా బీరప్ప ఆరోగ్యం దెబ్బతిన్నది. అసలే వయసు మళ్ళటంచేత చాలా నీరసించిపోయాడు. తండ్రి పరిస్థితి చూచి తిమ్మప్పకు మతిపోయింది. ఎందరో వైద్యులు చికిత్సచేసినా వ్యాధి నయం కాలేదు. మంచాన పడివున్న భర్తకు సపర్యలు చేస్తూంది భార్య. ఆమె దుఃఖానికంతు లేదు. భగవంతుడే అతడ్ని కాపాడాలని మ్రొక్కుకున్నది. బీరప్ప శ్రీనివాసుడ్ని స్మరించుకొంటూ తన ప్రార్థనానికి వగచాడు.

బాలలూ : బాల్యంనుంచి భగవత్కార్యాలపట్ల ఆసక్తి చూపుతూంటే అంత్యదశలు వాట్ని విస్మరించకుండా వుండవచ్చు. చిన్నప్పుడు వృధాగా కాలక్షేపంచేసి, వృద్ధాప్యంలో భగవత్కార్యాలు చేయాలనుకుంటే లాభం లేదు అతడి నామజపం చేయాలనుకుంటే సాధ్యంకాదు. జవసత్వాలుడిగిన తర్వాత పుణ్యకార్యాలు చేయలేరు కనుకనే శ్రీ కాళహస్తీశ్వర శతకకర్త ఇలా అన్నాడు:

'దంతంబుల్ పడనప్పుడే తనువునందారూఢి యున్నప్పుడే
కాంతాసంగము రోయనప్పుడె జరాక్రాంతుండు గానప్పుడే
వింతల్మేన జనింపనప్పుడె కురుల్ వెల్వెల్ల గానప్పుడే
చింతింపన్ వలె నీ పదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా'

మనది పాంచభౌతిక దేహం. కాలానుగుణంగా ఈ శరీరం విచిత్రమైన మార్పులను పొందుతుంది. నోటి పళ్లు రాలిపోతుంది. శరీరశక్తి నశిస్తుంది. స్త్రీ సుఖంపై రోతపుడుతుంది ముసలితనం బాధిస్తుంది. చర్మం ముడతలై పోతుంది. శరీరకాంతి తగ్గుతుంది. నల్లని వెంట్రుకలు తెల్లగా పండుతుంది. దృష్టి మందగిస్తుంది. శరీరాని కిలాంటి మార్పులు ప్రకృతిసహజమైనవి. ఇలాంటిని జరక్కముందే జాగ్రత్తపడి భగవత్కృత్యాలు చేయాలి. పుణ్య కార్యాలు చేయాలి. దేవుని పాదపద్మాలను చింతిస్తూ కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి.

వీరప్ప శ్రీహరిని స్మరించుకొంటున్నాడు. తనకు మరణం సమీపిస్తోందని తెలుసుకున్నాడు. కొడుకును పిలిచి 'నాయనా! నేనిక ఎంతో కాలం జీవించను. నా తర్వాత నీవు వంశపారంపర్యంగా వున్న కులవృత్తిని స్వీకరించు! ధర్మంగా మసలుకో. ఇంతకాలం నీవు భగవత్కార్యాలలో విముఖత చూపావు- ఆ ఏకుకొండలవాడి అనుగ్రహంతో నీవు కలిగావు.



కనుక గోవిందుడిని నమ్ముకో. మంచిపేరు తెచ్చుకో'. అని హితబోధ చేశాడు.

తండ్రి చెప్పినమాటలు శ్రద్ధగా విన్నాడు తిమ్మప్ప. అలాగే మసలు కుంటానని తండ్రికి మాట ఇచ్చాడు. బీరప్ప కళ్ళు మూసాడు.

'అయ్యో పాపం!' బీరప్ప చనిపోయాడా? అంటూ పిల్లలు బాధ పడ్డారు. అందరి హృదయాలు బరువైనాయి.

అప్పుడు దాసులవారు "బీరప్ప శరీరానికే మరణం. జీవాత్మకు చావు లేదు. స్థిరమైన ఆత్మ అనేకములైన శరీరాలను పొంది శేషకర్మలను పూర్తి చేస్తుంది. ఎవరి కర్మలనుగుణమైన పునర్జన్మలు వారికి లభిస్తుంది. జన్మరాహిత్యము ఒక్క ముక్తి లభ్యమైనప్పుడే అన్ని జన్మలకన్నా మానవజన్మ ఉత్తమమైనది. లభ్యమైన ఈ పుట్టుకను సత్కార్యాలతో సార్థకం చేసికోవాలి వృథాగా కాలాన్ని దుర్వినియోగం చేయకూడదు.

శ్లో॥ కాలక్షేపో నకర్తవ్యః। క్షీణమాయుః క్షణేక్షణే॥
యమస్య కరుణానాస్తి। కర్తవ్యం హరికీర్తనం॥

అనవసరంగా కాలాన్ని వ్యర్థం చేయరాదు. ఆయువు క్షణక్షణానికి క్షీణించిపోతుంది. యముడి కరుణ లభించదు. కనుక శ్రీహరిని కీర్తించడమే మన ముఖ్యకర్తవ్యం.

తండ్రి చనిపోయిన పిదప కనకుడు శాస్త్రోక్తంగా కర్మలు చేశాడు. తల్లిని ఓదార్చాడు. ఊహించని ఈ పరిణామం తిమ్మప్పను కలవరపరిచింది. 'ఏనాటికైనా ప్రతిఒక్కరూ మరణించాల్సిందే కదా!' అని అనుకున్నాడు. శరీరంపైన భ్రాంతి వుండరాదని తలచాడు. తండ్రి బోధనలను గుర్తుకు తెచ్చుకున్నాడు.

తిమ్మప్ప ఇప్పుడు గ్రామాధికారి. ఇంతకాలం తండ్రి అండదండలతో పెరిగాడు ఇలాంటి వ్యవహారాలకు దూరంగా వున్నాడు. ఇప్పుడు బాధ్యత

నెత్తినపడింది. సాధ్యమైనంత చక్కగా తనవృత్తిని నిర్వర్తించాలని ప్రయత్నించాడు. పెద్దలను గౌరవించి వారి మాటలను విన్నాడు. మంచిమిత్రుల సలహాలను పాటించాడు. పదవిలో వున్నాడని పాతమిత్రులను మరువలేదు. గర్వంతో పొంగిపోలేదు. అయినా యుద్ధవిషయాసక్తి మాత్రం తిమ్మప్పలో పెరుగుతూనే వుంది.

తిమ్మప్ప చక్కగా తన వృత్తిని నిర్వహిస్తున్నాడు. అసలే ఆజానుబాహుడు. కండలు తిరిగిన శరీరం. గంభీరమైన ఆకారం. పైపెచ్చు వృత్తి రీత్యా కఠినుడు. సజ్జనులకు సన్నిహితుడు. ఇతడ్ని చూడగానే, అడగనవసరం లేకుండా, ప్రజలు వన్నులు చెల్లించేవారు. ఇలాంటి నాయకుడు తమకు అండగా వున్నాడనే ధైర్యం వారికుంది. అటు ప్రభుత్వాధికారుల మన్ననలను కూడ పొందాడు. 'తండ్రిని మించిన తనయుడని' అంతా మెచ్చుకున్నారు.

తిమ్మప్ప మిత్రులతో వేటకు వెళ్ళేవాడు. బాధ్యత నెపంతో ఇరుగు పొరుగు గ్రామాలకు వెళ్ళేవాడు. ఎప్పుడూ అధికారులతో, ఉద్యోగస్తులతో రాజకీయ వ్యవహారాలను చూసేవాడు. ఇంటిపట్టున ఉండేవాడే కాదు. విశ్రాంతి ఎరగడు.

కుమారుడి విషయమై తల్లికి విచారం కల్గింది. చదువు సంధ్యలు లేనిదే సక్రమమైన పద్ధతిలో వీడు వుండడని తలంచింది. పెండ్లిచేసుకునే వయసుంది కనుక కోడలు వస్తే ఇతడిలో మార్పువస్తుందని ఆలోచించింది. కొడుకును పిలచి నాయనా! గ్రామాధికారిగా ఉండటమే నీ జీవితలక్ష్యంగా తలంచవద్దు. చక్కటి పిల్లను పెళ్ళిచేసికో, సంసార జీవితాన్ని ప్రారంభించు. పిల్లాజెల్లాతో వుంటేనే ఇల్లు కళకళలాడ్తుంది నాకూ పొద్దుపోతుంది.

చతుర్విధ ఆశ్రమాలలో గృహస్థాశ్రమం శ్రేష్ఠమైంది. అతిథి అభ్యాగతులను సేవించటానికీ, పుణ్యకార్యాలు చేయటానికీ, వంశాన్ని

తరింపజేసికోవటానికీ, భోగభాగ్యాలనుభవించటానికీ ఇదే మూలము. ఇలాంటి విషయాలను గూర్చి మన గ్రంథాలు చక్కగా వివరిస్తున్నాయి. నీకు సద్విద్యలు అలవడలేదు. చదువులేనివాడికి భారత, భాగవతాది గ్రంథాలలోని సూక్ష్మాలెలా తెలుస్తాయి? అసలు నీవు ఒక్కరోజైన్నా భగవంతుడ్ని పూజించావా? అతడి ఆజ్ఞలేనిదే ఏపనీ జరగదు. మీతండ్రి చెప్పిన హితవాక్యాలు మరిచావా? ఏడుకొండలవాడ్ని విశ్వసించి పూజలు చేయి. పుణ్యకార్యాలు ఆచరించు. సద్గ్రంథాలు చదువు.' అని చెప్పింది.

'తల్లీ! చదువుసంధ్యలు-పూజలు-పునస్కారాలు కేవలం బ్రాహ్మణులకే పరిమితమైంది. వీరకులంలో పుట్టిన నాలాంటి వారికి కాదు. శత్రువులతో పోరాడటం, ప్రజలను చక్కగా పాలించటం. మనధర్మం వీరుడిగా పుట్టిన నేను వీరుడిగానే మరణిస్తాను. ఇకపోతే మంచి విద్యలు అభ్యసించటమా! నాలో మంచితనం లేదా తల్లి. చదువుకున్నవారే మంచివాళ్ళా! ఇక శాస్త్రగ్రంథాలు, భారతాది కథలు నాకెందుకమ్మా! నేనేమైన పండితుడ్ని కావాలా! గ్రంథాలు రచించాలా! నా పదవికి తగిన తెలివితేటలు నాకున్నాయి! అంతేచాలు!' అని సమాధానమిచ్చాడు.

'బాబూ! నాకోరికను మన్నించి, కనీసం పెళ్ళైనా చేసికో!' అన్నది. తల్లి మాటను కాదనలేకపోయాడు వయసు మళ్ళిన తల్లిని బాధించటం ఇష్టంలేక ఆమె కోరిక ప్రకారం వివాహానికి సమ్మతించాడు.

ఒకమంచి ముహూర్తంలో ఇతడి పెళ్ళి జరిగింది. గృహస్థ జీవితం సాఫీగా సాగిపోతోంది. తల్లి ఆనందంతో మురిసిపోయింది.

ఒకనాడు తిమ్మప్ప తనపొలంలో బావి త్రవ్వించతలచి కూలీలను రావించాడు. పని ప్రారంభమైంది. కొంత మట్టి తీసింతర్వాత అనుకోని విధంగా అదృష్టదేవత అతడ్ని వరించింది. అపారమైన నిధి లభించింది. తిమ్మప్ప భాగ్యవంతు డయ్యాడు. 'కనకం' దొరకటం మూలాన ఆరోజు నుంచీ అతడికి 'కనకనాయకు'డనే పేరు వచ్చింది.

"ఓహో! ఇదా అసలు విషయం! కనకం దొరికింది కనుక ఇతడికి కనకనాయకుడను పేరు వచ్చింది. మరి 'కనకదాసు' అని ఎలా మారింది?' అడిగింది వాణి.

'ఏముంది! బంగారానికి బానిసయి, లోభిగా మారిపోయి వుంటాడు" అన్నాడు ప్రసాద్.

"బాగుంది మీ ఆలోచనలు! ఇప్పుడు పాలెగాడుగా అధికారంలో వున్నాడు. కనుక కనకనాయకు డయ్యాడు. పిమ్మట దాస దీక్షను స్వీకరించి కనకదాసుగా మారాడు.

"ధనమ్ మూల మిదమ్ జగత్" అన్నది సత్యం. ఈ కాలంలో డబ్బుకున్న ప్రాధాన్యత అంతా ఇంతాగాదు. ఎంతటి అసాధ్యపు పనినైనా డబ్బుతో సాధించవచ్చు. చతుర్విధ పురుషార్థాలలో 'ధనం' గొప్పది. సత్కార్యాలు చేయటానికి, దుష్కృత్యా లాచరించటానికి ధనమే ముఖ్యం. సత్పురుషుల సంపద పుణ్యకార్యాలకు వినియోగపడుతుంది. ధర్మకార్య నిర్వహణలో వీరికి విసుగు, విరామం వుండదు. దుష్టులు స్వార్థంతో దుర్మార్గాలు చేస్తూ, డబ్బును దుర్వినియోగం చేస్తారు. వీరికిలాంటి పనులు చేసేప్పుడు సమయం చాలదు.

కనకుడు తనకు లభించిన సంపదతో సత్కార్యాలు చేయ సంకల్పించాడు. ఒకప్పుడు భగవత్ కార్యాలకు, పుణ్యకృత్యాలకు విముఖంగా వున్నవాడు, ఇప్పుడు వాటినే చేయ బూనటం చాలా ఆశ్చర్యంగా వుంది కదూ! అఘటన ఘటనా సమర్థుడైన పరమాత్మ, ఇచ్ఛామాత్రంతో ఎటు వంటి వారినైనా మార్చివేయగలడు. అసలు ధర్మాంశ సంభూతుడైన కనకుడు ధర్మకార్యాలు చేయడం సమంజసమే కదా!

కాగినిలో శిథిలమైన దేవాలయాన్ని పునరుద్ధరించే పనిని తొలుత చేపట్టాడు. ప్రజలంతా ఇతడి నిర్ణయానికి సంతసించారు. అందరూ కలిసి ఈ పనికి సహకరించారు. ఏదో నవోల్లాసం కనకుడిలో కన్పించింది గుడి

పని పూర్తయింది. తన జన్మస్థలమైన "బాడ" గ్రామంనుంచీ శ్రీ చెన్న కేశవ స్వామి విగ్రహాన్ని తెప్పించి ఆ దేవాలయంలో శాస్త్రోక్తంగా ప్రతిష్ఠ చేయించాడు. మంగళ వాయిద్యాలతో, జనుల కోలాహలంతో ఉత్సవాలు చాలా వైభవంగా జరుగుతోంది. చుట్టు ప్రక్కలనున్న గ్రామవాసులంతా ఆ తిరుణాళ్ళలో పాల్గొన్నారు. భజనలు చేశారు భక్తితో భగవంతుణ్ణి అర్చించారు. అధికారము, ధనబలము గల కనకుడి పర్యవేక్షణలో వేడుకలు చక్కగా జరుగుతున్నాయి అక్కడ జాతి, మత-పేద, ధనిక వ్యత్యాసాలకు తావులేదు. అంతా ఒకటిగా కలసిపోయారు

కనకుడు నుదుట తిలకం తీర్చి, పరిశుభ్రమైన వస్త్రాలు ధరించి వ్రతదీక్షను స్వీకరించాడు. యజ్ఞాలు, అర్చనలు, అభిషేకాలు అన్నీ సవ్యంగా జరిపించాడు. ఆ సమయంలో రంగు రంగుల దుస్తులతో, కాషాయ రంగు జెండాలు ధరించిన భజన బృందం వొకటి నృత్యం చేస్తూ అందరి దృష్టినీ ఆకర్షించింది. అంతా ఆనందోత్సాహాలతో చిలకిస్తున్నారు. చేతులతో తాళాలు వేస్తున్నారు. ఆ కార్యక్రమాన్ని తదేకంగా చూస్తున్న కనకదాసు, తాను కూడా అలా భజన చేస్తూ నృత్యం చేయాలని భావించాడు. కానీ తన హోదాకది తగని పని అనుకున్నాడు. ఏమో ! భవిష్యత్తులో ఎలాంటి మార్పు రానున్నదో ఎవరి కెఱుక !

కనకడు భక్తితో పూజాదికములు పూర్తి చేశాడు సంతర్పణలతో, సంభావనలతో ఉత్సవాలు ముగిసాయి.

ఆనాటినుంచీ ఆలయంలో నిత్య పూజలు జరుగుతోంది. ప్రజలంతా కనకనాయకుడ్ని వేనోళ్ళా పొగిడారు. అతడి కీర్తి ప్రతిష్ఠలు బాగా ఇనుమడించింది. ఇతడి విషయం కర్ణాకర్ణిగా విజయనగర ప్రభువుల చెవిన పడింది. రాజుగారు కనకుడ్ని చూడాలని పిలిపించారు. ఆ యేసు పన్నులు వసూలు చేసి కనకుడు రాజధానికి పయనమయ్యాడు. అక్కడి

అధికారులు కనకుడ్ని సగౌరవంగా ఆహ్వానించారు. ప్రభువు ప్రత్యేకాదరంతో కనకుడ్ని పలుకరించాడు. కనకుని గ్రామ పరిస్థితులను గూర్చి ముచ్చటించాడు. తగినంత సైనిక బలగాన్ని పెంచుకున్నాడు.

కనకుడి పలుకుబడి పెరిగింది. విజయనగరమంతటా అతడి పేరు ప్రతిధ్వనించింది. ప్రభువులను వీడ్కొని తన గ్రామానికి తిరిగి వచ్చాడు.

గ్రామంలోని వారంతా ఘనంగా స్వాగతం పలికారు. తల్లి తనయుడ్ని మెచ్చుకున్నది. నిజమైన పుత్రోత్సాహంతో పులకరించి పోయింది.

కనకుడు యథాపూర్వకంగా తన పనులు చేసుకుపోతున్నాడు. ప్రభుత్వాన్ని సమర్ధవంతంగా నడిపిస్తున్నాడు. రాజుగారి ఆదేశానుసారం సైనిక శిక్షణకు ప్రాధాన్యమిచ్చాడు. గ్రామంలోని యువకులను చేర్చాడు. యుద్ధ విద్యలు నేర్పాడు. అందరినీ గొప్ప వీరులుగా తయారుచేశాడు. యుద్ధాలు చేయాలని అతడి మనసు తహ తహ లాడుతున్నది.

కనకుడి యేలుబడిలోని గ్రామాలలో పుష్కలంగా వర్షాలు పడుతున్నాయి. పాడిపంటలతో ప్రజలు సుఖంగా జీవిస్తున్నారు. సక్రమంగా పన్నులు చెల్లిస్తున్నారు. వినోదాలతో వేడుకలతో కాలం హాయిగా దొర్లి పోతున్నది. హైందవ ధర్మాలను అందరూ పాటిస్తున్నారు. కారణ జన్ములు నివసించే ప్రాంతం సస్యశ్యామలమై అలరారుతుంది !

ఒక దినం వింత సంఘటన జరిగింది. రాత్రి మాంచి నిద్రలో వున్న కనకుడికి కలలో కేశవుడు ప్రత్యక్షమై "కనకా ! నేను కేశవుణ్ని. నీవు నాకు దాసుడవగుము. నీ జన్మ తరిస్తుంది." అని ఆదేశించాడు !

కనకుడు కంగారుపడి వెంటనే మేల్కొన్నాడు. తన కలను తలచు కుని నవ్వుకున్నాడు. ఇదేమి విచిత్రమని అనుకుని, కలను కల్లగా భావించి

నిద్రపోయాడు. శ్రీహరి మళ్ళీ కన్పించి మునుపటిలాగా "దాసుడవగుమని" కోరాడు. కనకుడు లేచి ఆలోచనలో పడ్డాడు. "ఏమిటీ వింత ! ఎన్నడూ లేనిది శ్రీహరి ఇలా స్వప్నంలో కన్పించి దాసుడవగుమని కోరుతున్నాడే ! నేనా మంచి పేరు ప్రఖ్యాతులు పొందిన వాడిని. దాసుడనై హరి సేవలు చేయటం సంభవమా ?" అని తర్కించుకున్నాడు. రాత్రంతా నిద్రపోక నిద్రపోక జాగరణ చేశాడు.

ఉదయాన్నే లేచి కాలకృత్యాలు ముగించుకుని గుడికెళ్ళి కేశవుడి దర్శనం చేసికున్నాడు. తనకు వచ్చిన కలను గూర్చి ఇతరుల కెవ్వరికీ వెల్లడి చేయలేదు తన మనసులోని అరాటాన్ని దేవుడికే చెప్పుకున్నాడు. ఏ పనినీ కుదురుగా చేయలేకపోయాడు.

ఇలా కొంతకాలం జరిగింది. హఠాత్తుగా ఒకరోజు కనకుడి భార్య మరణించింది. ఏదో తెలియని వైరాగ్యం అతడిలో అంకురించింది. మునుపటిలాగా అన్ని వ్యవహారాలల్లో ఆసక్తిని చూపలేకపోయాడు. అందరితో ముభావంగా వుంటూ వచ్చాడు.

కనకుడిలో కలిగిన మార్పునకు మిత్రులంతా విస్తుపోయారు. జరిగిందేమిటో చెప్పమని వొత్తిడి చేశారు. అతడి భార్య గతించడటమే ఈ మార్పుకు కారణమని అనుకున్నారు ధైర్యంగా వుండమని హితవు చెప్పారు. బలవంతంగా వేటకు పిలుచుకుని వెళ్ళారు. మృగయా వినోదంతో అతడి మనసు కాస్త కుదుట పడింది.

కొంత కాలానికి తల్లి కూడా మరణించింది. తన వాళ్ళంటూ ఎవరూ లేకపోయారని కృంగిపోయాడు. తనను సేవిస్తున్న భార్య, తాను సేవిస్తున్న తల్లి గతించడంతో వ్యథ చెందాడు. దిక్కు తోచని స్థితిలో అతడి మనసు పట్టాలు తప్పిన రైలు బండిలా అయింది.

ఒకరోజు శ్రీహరి మళ్ళీ స్వప్నంలోకి వచ్చి "కనకా ! ఇప్పుడైనా నాకు దాసుడవగుము ! నాకు దాసుడవైతే భవబంధాలు విడిపోతాయి." అన్నాడు.

కనకుడు నిద్రపదలి "శ్రీహరి కొక ఆట లాగుంది. మాటి మాటికీ కన్పించి ఒకే విషయాన్ని గూర్చి అడుగుతున్నాడు. నేనెందుకు దాసుడుగా మారాలి ? నా ఆత్మాభిమానం ఏం కావాలి ? ఇంకెవ్వరూ హరికి దొరక్క-పోయారా ? నన్నే పట్టుకుని పీడిస్తున్నారు" అంటూ తలపోశాడు.

నిజమైన ఆత్మాభిమానం గలవాడు ఎవ్వరికీ తలవంచడు. సాక్షాత్తు దేవుడే వచ్చి వగాలిస్తానంటే వద్దంటాడు. కనకుడు కూడా స్వాతిశయంతో శ్రీహరి మాటలను ఆమోదించక తిరస్కరించాడు.

భగవంతుడు సమయం వచ్చినపుడే తన భక్తులను ప్రబోధిస్తాడు. అనుక్షణం వారి చర్యలను గమనిస్తూంటాడు. అనేక రకాలగా పరీక్షలు పెట్టి తన వాళ్ళుగా చేసికుంటాడు. ఊహించని భోగభాగ్యాలిచ్చి సుఖ సంతోషాలను కల్గిస్తాడు. సర్వాన్ని అపహరించి బికారిని చేస్తాడు సాధారణ మానవులు అతడికి లీలలను అర్థం చేసికోలేరు. ఆ కపట నాటక సూత్రధారి సంకల్పానికి ఎదురులేదు !

కొంతకాలమైన తర్వాత మళ్ళీ శ్రీహరి కలలో దర్శన మిచ్చి "కనకా ! ఈ చరాచర జగత్తుకు నేను ఆధారభూతుడను. నా ఆజ్ఞలేదే తృణము కూడా కదలదు. నీవు నన్నాశ్రయించు. నా దాసుడవై తరించు" అన్నాడు.

"నేను ధనవంతుడిని, అధికార బాధ్యతలను వదలి నీకు దాసుడనై తిరిప మెత్తుకొని జీవించాలా ? అసంభవం ! నేను దొరను. దొరగానే జీవిస్తాను నీకు దాసుడిగా మాత్రం మారను. నీ ఆజ్ఞలేనిదే ఏదీ జరగదన్నావే! ఏదీ చూద్దాం ! నాకు తెలియకుండానే నీకు దాసుడయ్యేలా చేసికో !" అని

నిష్కర్షగా సమాధానమిచ్చాడు కనకుడు. శ్రీహరి చిఱునవ్వులు చిందిస్తూ అదృశ్యమయ్యాడు.

శ్రీహరి నగుమోము చూసిన కనకుడికి పరమానందం కలిగింది. ఎంత చక్కటి రూపం! అంతా బాగుంది కానీ, తనకు దాసుడుగా మార్చాలనేది మాత్రం బాగాలేదని అనుకున్నాడు.

కొన్ని రోజులు గడిచిపోయింది. మునుపటిలా శ్రీహరి కలలో కన్పించి వేధించటం లేదు. పీడ విరగడైనట్లు భావించాడు. తన కార్యాలలో నిమగ్నుడైపోయాడు. కానీ రోజులు దొర్లే కొద్దీ కనకుడిలో సరికొత్త ఆరాటం ఆరంభమైంది. ఎందుకు హరి మళ్ళీ కన్పించలేదు! అన్న ఆలోచన ఏర్పడింది. అతడికి తెలియకుండా శ్రీహరిని గూర్చిన చింత ఎక్కువైంది. ప్రతిరోజూ రాత్రి శ్రీహరి కోసం ఎదురు చూసి నిరాశ చెందేవాడు. ఈ సారి కలలోకి వస్తే అటో ఇటో తేల్చేయాలనుకున్నాడు. మరి అతడి రూపం మాత్రం కళ్ళకు కట్టినట్లుగా వుండేది.

రోజులు దొర్లిపోతున్నాయి. హరి అతడి మనసును హరించాడు కానీ, కలలోకి వచ్చి మునుపటిలా పల్కరించలేదు. "దృఢమైన నా నిర్ణయంతో, ఇక ప్రయత్నించి లాభం లేదనుకొన్నాడు కాబోలు! పాపం హరి తిరిగి కన్పించటం మానుకొన్నాడు. చూద్దాం, ఈ రోజు రాత్రికి వస్తాడేమో!" అని ఇలా ప్రతి రోజు తలపోస్తూ నిద్రించేవాడు. ఆహరి మళ్ళీ రాలేదు. అతడిపై ధ్యాస కనకుడ్ని వీడలేదు.

కనకుడు ఈ విషయాన్ని మరచిపోవా లనుకొన్నాడు. హఠాత్తుగా ఆరోజు రాత్రి శ్రీహరి ప్రత్యక్షమయ్యాడు. "ఏమిటి కనకా! నన్ను మరచి పోవాలని ప్రయత్నిస్తున్నావా! నీవు నాకు దాసుడవు కావాల్సిందే! ఏదో త్వరగా తెమల్చు!" అన్నాడు.

కనకుడిలో తిరిగి ఆత్మాభిమానం చోటు చేసుకున్నది. "అయ్యా! స్వామీ! నేనెందుకు నీ దాసుడ్ని కావాలి? దీని వల్ల నీకు ఒరిగేదేమిటి? నీవు శతవిధాలా మాయోపాయములు చూపినా నేను నీ దాసుడ గా మారటం కల్ల!" అని బింకంగా జవాబిచ్చాడు. అతడిలో వివేకం ఇంకా మేలుకో లేదు.

శ్లో॥ యౌవ్వనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా।
ఏకైక మప్యనర్థాయ। కిము యత్ర చతుష్టయం॥

అని సుభాషితం.

యౌవ్వనము, ధనసంపత్తి, అధికారము, అవివేకము-ఇవి ఒక్కొక్కటి అనర్థదాయకములైనవి. ఈ నాల్గూ ఒక వ్యక్తినే ఆశ్రయించినపుడు చెప్పేదేముంది? "అసలే కోతి, తేలుకుట్టింది, ఆ పైన కల్లు త్రాగింది, నిప్పులు తొక్కిండి-" అన్నట్లు అవుతుంది.

కనకుడిలో నాల్గింటి ప్రభావం బాగా పని చేస్తోంది. మాంచి వయసులో వున్నాడు. అపారమైన ధన సంపద వుంది. అధికార గర్వముంది. భగవంతుడ్ని గురించి విచారించలేని అవివేకమూ వుంది. ఇక దేనికి లొంగుతాడు. పై పెచ్చు ఏదో అవాంతరం వచ్చి తన దొరతనము, సంపద పోయినా, జన్మతః గొల్లవాడు కనుక పశువులను మేపుకొంటూ బ్రతుక వచ్చనే ధీమాతో వున్నాడు. అందుకే శ్రీహరిని మొండిగా తిరస్కరించాడు.

శ్రీహరి అంత సులభంగా వదలుతాడా! కనకుడు మొండి వాడైతే తాను జగమొండినని, తరుచుగా కలలో కన్పించి "దాసుడవగుము; దాసుడ వగుమని" వొత్తిడి చేస్తూనే వున్నాడు. కనకుడు ప్రతిసారీ "నేను దాసుడ్ని కాను" అంటున్నాడు.

"కనకుడు మరీ మొండి వాడండి! అంత పట్టుదల పనికి రాదు. పోనీ శ్రీహరి మాత్రం ఎందుకలా బలవంత పెట్టడం!" అడిగింది గాయత్రి.

నీకు మంచి అనుమానమే కల్గింది. నిర్హేతుక దయా స్వరూపుడైన పరమాత్మ లీలలే అటాంటిది. తన వాళ్ళు తనను మరచినా, తాను మాత్రం వాళ్ళను ప్రబోధిస్తూనే వుంటాడు. జన్మాంతరములలో భక్తులు కర్మవశులై తప్పుదారిలో పడినపుడు వారిని హెచ్చరిస్తాడు. తన వైపుకు మళ్ళించు కొంటాడు. ఆ కపటనాటక సూత్రధారికి భక్తుల పైన అమితమైన వాత్సల్యం. పురందరదాసు కథలోనూ ఇలాంటి ఎక్కు నిదర్శనాలు జరిగాయి కదా!

పరస్పర వైవిధ్యం గల ద్వంద్వ భావాలతో కనకుడు దిక్కు తోచక తికమక పడ్డాడు. అతడి ఆలోచనలు పరిపరి విధాలుగా సాగుతోంది. తండ్రి, తల్లి, భార్య గతించడం అతడికి పెద్ద దెబ్బ. అన్నిటికన్నా శ్రీహరి పోరు మరీ ఎక్కువైంది. తన వృత్తి ధర్మాన్ని వదలలేదు. యుద్ధాసక్తిని విస్మరించ లేదు. శ్రీహరికి దాసుడుగా మారలేదు.

కొంతకాల మయింది. అనుకోకుండా విజయనగర రాజుకు పొరుగు రాజ్యంతో యుద్ధం సంభవించింది. ప్రభువుల అజ్ఞమేరకు కనకనాయకుడు తన బలగంతో కదన రంగానికి కదలి వెళ్ళాడు. కత్తిపట్టి శత్రువులతో భీకరంగా యుద్ధం చేశాడు. తన చిరకాల వాంఛితం నెరవేరుతున్నందుకు పొంగిపోయాడు. సాహసంతో పోరుసలిపి శత్రువుల శిరస్సులను ఖండించ సాగాడు.

"భలే, భలే! కనకుడి కోరిక ప్రకారమే జరిగింది కదండీ? శ్రీహరి ఓడిపోయాడు! అతడి ప్రయత్నం ఫలించలేదు. మానవుల ఆత్మబలం ముందు దేవుడు ఓటమిని పొందాల్సిందే" అన్నాడు ప్రసాద్.

"పిమ్మట యుద్ధం ఎలా జరిగింది? శత్రువులు లొంగిపోయారా? కనకుడికి దెబ్బలేమైనా తగిలాయా! కథానాయకుడు ఎప్పటికీ ఓడిపోడు.

మన సినిమాలలో నాయకుడు వంద మందిని మట్టి గఱిపిస్తాడు. ఎప్పటికీ ఓడిపోడు. కనకనాయకుడూ అంతే కదండీ!" అడిగాడు వంశీ.

దాసులవారు చిఱునవ్వుతో,

"చిరంజీవులారా! శ్రీహరి అంత సులభంగా చిక్కుతాడా! కనకుడి మనోభిప్రాయం మేరకు జరిగినా ఆ దేవుశాడించే ఆటలు మనకు తెలియవు. ఆ తర్వాత ఏం జరిగిందంటే!

యుద్ధం జోరుగా సాగుతోంది. రెండు వర్గాలూ ప్రాణాలకు తెగించి ముమ్మరంగా పోరాటం సలుపుతున్నాయి. ఎందరో వీరులు యుద్ధ భూమికి బలైపోయారు. పాపం నోరులేని జంతువులు సైతం చచ్చిపడుతున్నాయి. ఏనుగులు, గుఱ్ఱాలు నశిస్తున్నాయి. యుద్ధమంటే మాటలా? బంధుమిత్రులు, భార్యా బిడ్డలు దూరమౌతారు. ధన నష్టము, ప్రాణనష్టము కలుగుతుంది. కదన రంగం స్మశానంలా మారుతుంది. ఎక్కడ చూసినా రక్త ప్రవాహములు, తెగిపడిన అవయవాలు. అంతా భీభత్సంగా వుంటుంది.

ఆ నాటి యుద్ధాలు రథ—గజ—తురగ—పదాతులనే చతురంగ బలాలతో వుండేవి. చక్రవ్యూహము, నాగ, గరుడ, పద్మవ్యూహాలతో సాగేవి. మొత్తం పైన ధర్మబద్ధంగా జరుగుతూండేవి.

ఈనాడు మారణాయుధాలతో, వంచనలతో జరుగుతున్నది. అణ్వాస్త్ర యుద్ధాలే సంభవిస్తే మానవ జాతి అంతా సర్వనాశనం కాక తప్పదు. మానవుల విజ్ఞానం జీవకోటి పతనానికి దోహదం కారాదు. ప్రపంచ శాంతి స్థాపన జరగాలి. కనుకనే అన్ని దేశాలూ శాంతి కోసం ఆరాట పడుతున్నాయి.

"సర్వేజనాః సుఖినో భవంతు
ఓం శాంతిః ఓం శాంతిః ఓం శాంతిః"

అని దాసుల వారు శాంతి మంత్రం పఠించారు.

ఆనాటి యుద్ధంలో కనకుడు తన కఱకు కరవాలంతో భయంకరంగా పోరాడినాడు. పోరు భీకర రూపం దాల్చింది. శత్రువులు బాగా విజృంభించారు. కనకుడి సైన్యంలో చాలామంది రణ రంగానికి బలైపోయారు. విరామ రహితంగా పోరాడుతున్న కనకుడికి అలసట కల్గింది. అతని బలమూ క్షీణి స్తోంది. అనుకోని క్లిష్ట పరిస్థితి ఏర్పడింది. విధి వక్రించింది. జయాపజయ ములు దైవాధీనములు కదా!

శత్రువులు కనకుడ్ని చుట్టు ముట్టారు. ప్రాణాలకు తెగించి అతడు యుద్ధం చేస్తున్నాడు. వీరధర్మాన్ని ఆచరించాడు. గుండె ధైర్యంతో పోరాడు తున్నాడు. అతడి శరీరమంతా గాయాల మయమైంది। అతడి సైన్యం నశించింది. ఏకాకిగా శత్రువుల మధ్య చిక్కుకున్నాడు. అయినా ఆత్మ బలంతో వారిని ఎదుర్కొంటున్నాడు. అంతటి పరిస్థితుల్లోనూ ఆత్మ విశ్వాసాన్ని వీడలేదు. "ధైర్యే సాహసే లక్ష్మీః" అన్నారు పెద్దలు. వైరులకు వెన్ను చూపక పోరాడటం, ఉత్తమ నాయకుల లక్ష్యం. కానీ విధి వైపరీత్యాన్ని ఎవరూ కాదనలేరు.

మానవ ప్రయత్నం ఎంత గొప్పదైనా, దైవబలం లేకపోతే ప్రయో జనం లేదు.

"శరణము దైవమె, పురుష శక్తి నిరర్థక మెన్ని భంగులన్" అను సుభాషితం సత్యమైనది.

యుద్ధం చేస్తున్న కనకనాయకుడిపై శత్రువులు పిరుచుకు పడ్డారు. అతడ్ని చుట్టుముట్టి బాగా చితకగొట్టి పడేశారు. శరీరమంతా గాయాలే. రక్తం బాగా స్రవించింది. కనకుడు స్పృహ కోల్పోయాడు. మరణించి వుంటాడని శత్రువులు తలంచి వెళ్ళిపోయారు.

కథ వింటున్న వారి హృదయాలు దుఃఖపూరితా లయ్యాయి నుంచీ నీళ్ళు కారింది కొందరికి. కనకుడు మరణించాడేమో! అన్న మానం కలిగింది. దాసులవారు కళ్ళకు కట్టినట్లుగా కథ చెప్పుకుపోత వింటూన్న వారి మనస్సుల్లో చొచ్చుకుపోతోంది. అలా కథలను కూడా ఒక వరం! గొప్పకళ! వశీకరణాద్భుత శక్తి! భాగవతోత్తము చెప్పటం—మహిమలు వివరించటం, ఇహపర సాధకములు. వేదాంత శ్రోతల కర్థమయ్యేలా సులభ పద్ధతిలో చెప్పాలి. సున్నితంగా సూ వివరించాలి. తత్త్వాలను నిజజీవితంలో అనుసంధానం చేసికున్న నీయులే భగవదావేశంతో పరమాత్మ లీలలను వర్ణించి చెప్పగలరు. రహితమైన వేదాంత జ్ఞానం నిష్ప్రయోజనము.

"కనకనాయకుడు చనిపోయాడాండి?" భయంతో, ఉదే అందరూ దాసులవార్ని అడిగారు.

"భయకృద్భయనాశనః"- అని బ్రహ్మాండ పురాణంలో చల మహాత్మ్యంలో చెప్పబడింది. భగవంతుడు భయాన్ని కలిగించ పోగొట్టనూ కలడు. కనకుడు కారణజన్ముడు. కనుక అకాలవ వాత పడడు. మీరు భయపడకండి.

ఆ రణరంగంలో అలా స్పృహలేకుండా పడి వున్న క ఉచ్ఛ్వాస, నిశ్వాస క్రియలు జరుగుతోంది. తక్కిన అవయవ చేయటంలేదు. కనుక అతడిలో ప్రాణం వుందని తెలుస్తోంది. ఈ ర్భంలో మీకొక విషయాన్ని వివరించాలి. ఒక మనిషి చనిపో ఎప్పుడెలా నిర్ణయిస్తారో పరిశీలిద్దాం!

ముసలితనం వల్లనో, అనారోగ్యం వల్లనో, అపదలు సం హూనప్పుడు మరణావస్థలో చలనరహితుడై పడి వుంటే చనిపోయిన యించరు. శ్వాసక్రియలు అతడిలో జరుగుతున్నంతసేపూ ప్రాణం

లెక్క. అవయవాలు పనిచేయక, ఇంద్రియ పటుత్వం నశించి, జ్ఞాపకశక్తి లోపించి, చూపు మందగించి మాటలు పడిపోయి అన్ని విధాలా నిరుప యోగమైన శరీరంలో ఉచ్ఛ్వాస నిశ్వాసక్రియలు జరుగుతుంటే ప్రాణం వున్నట్లు చెపుతారు. ఒకవేళ ఇవన్నీ సక్రమంగా వుండి శ్వాస నిలిచిపోతే అది "శవం" అనిపించుకొంటుంది. ఈ శ్వాసక్రియలు జీవకోటిలో సక్రమంగా నిర్వర్తించేవాడు ముఖ్యప్రాణుడు. అందే ఇది వాయుదేవుని వ్యాపార మన్నమాట.

సర్వోత్తముడైన శ్రీమన్నారాయణుడు చరాచర జగత్తును సృష్టించి, సమస్త జీవరాసుల పోషణాది కార్యాలను నిర్వహిస్తున్నాడు. లోకవ్యాపారం సక్రమంగా జరగటానికి తత్వేశులను నియమించాడు. వీరు జీవులందు చైతన్యక్రియలను చేపట్టి శక్తిసామర్థ్యాలను సమకూరుస్తారు. ఇక్కడ మనం జీవులను గూర్చి ముచ్చటిస్తున్నాము. జీవ-జడ భేదములు ప్రత్యక్ష గోచర ములు. అలాగే జడమునకు, జడమునకు వ్యత్యాసంవుంది. ఒకజీవికి మరొక జీవికి భేదం వుంది కనుకనే ఆనందతీర్థులు పంచ భేదములను గూర్చి వివరించారు.

జీవరాసులలో బింబరూపియై పరమాత్మ ప్రకాశిస్తున్నాడు. వారి వారి యోగ్యతల కనుగుణంగా ఫలితాలిస్తాడు. జీవులు "నేను-నాది-నా ఇష్టం" అని గర్వించరాదు. అంతటి స్వాతంత్ర్యం లేదు. భగవంతుడొక్కడే సర్వతంత్ర స్వతంత్రుడు. ఇంద్రుడు, సూర్యుడు, వరుణుడు,అగ్నిదేవుడు, వాయుదేవుడు మున్నగు తత్వేశులు పరమాత్మ ఆజ్ఞానుసారం తామె విధు లను నిర్వహిస్తారు వాయుదేవుడు అందరిలో శ్రేష్ఠుడు వివిధ జీవ రాసులలో శ్వాసక్రియలు జరిపిస్తూ "హంస, సోహం, స్వాహా" అంటూ, హంస నామక పరమాత్మను జపిస్తూ, తాను చేసే ఈ కార్యాలను భగవ దర్పితం చేస్తారు. విరామ రహితంగా బ్రహ్మకల్పముదాకా చేస్తుంటాడు. సత్వజీవులకు సుఖాన్ని సాంసారికులకు సుఖదుఃఖాలను, అధమ జీవులకు

అంతులేని దుఃఖాన్ని కలుగజేస్తాడు. హరికథామృత సారంలో ఈ విషయం చెప్పబడింది.

"అరుమూరెరడొందు సావిర। మూరెరడు శతస్వాస జపగళ।
మూరు విధ జీవరొళ గబ్బజ కల్ప పరియంత
తారదిసి సత్వరిగె సుఖ, సంసార మిశ్రరి గధమ జనరిగ
పార దుఃఖగళీవ గురు పవమాన సలహెమ్మ"॥

కనుక శ్రీహరి సర్వోత్తముడు. వాయు జీవోత్తముడు.

ఇక మనం అసలు కథలోకి వద్దాం.

కనకుడు స్పృహతప్పి పడి వున్నపుడు, శరీరావయవాలు పనిచేయలేదు. రక్తం బాగా స్రవించటంవల్ల మృతప్రాయు డయ్యాడు. ప్రాణం మాత్రం వుంది. అప్పుడు శ్రీహరి మానవ రూపంలో వచ్చి కనకుడికి శైత్యోపచారాలు చేశాడు. భక్తుల పైన వాడికెంతో వాత్సల్యం!

వెంటనే కనకుడు తేరుకున్నాడు. కళ్ళు తెరచి ఎదురుగానున్న మనిషిని ఆశ్చర్యంతో చూశాడు. తన పరిస్థితిని అవగాహన చేసికుని ఎదుటి మనిషిని "ఎవరు నీవు?" అని ప్రశ్నించాడు.

అప్పుడు శ్రీహరి చిఱునవ్వుతో, "ఏమి కనకా! నన్ను మరిచిపోయావా? నేను శ్రీహరిని. ఇప్పుడైనా నీవు నాదారికి రా! నాకు దాసుడవైపో! ఇలా గాయాలతో, నీరసించి పడి వుండటం బాగుందా? అకాల మృత్యువు వాత పడటం మంచిదా? కనుక నాకు దాసుడవయి తరించు" అన్నాడు.

కురుక్షేత్రంలో కర్తవ్య విముఖుడైన అర్జునుడికి గీతోపదేశం చేసి పార్థసారధి - ఇప్పుడు గీతార్థ సారమంతా "దాస" అన్న రెండక్షరాలలో కనకుడికి స్ఫురించేలా చేశాడు. నీవు నిమిత్త మాత్రుడవు. నా సంకల్పం

లేనిదే ఏపనీ జరగదు. కనుక నాకు దాసుడవగుము." అని సుగమమైన మార్గాన్ని సూచించాడు.

శ్రీహరి మాటలు కనకుని కలవర పెట్ట సాగింది. ఏదో విచిత్రమైన ప్రేరణకు గురి అవుతున్నాడు. అంతరాంతరాల్లో మథనం జరుగుతోంది. శ్రీహరిని చూస్తూ!

"తొలుత నా గాయాలు నయంకానీ, తర్వాత నీకు దాసుడనయ్యే విషయం యోచిస్తాను-" అన్నాడు

"ఈ గాయాలు పోవటం ఎంతపని? నేను తల్చుకుంటే చచ్చిన వారినే బ్రతికించగలను. సంకల్ప మాత్రంతో బాగా ఆరోగ్యంగా వున్న వాడి ప్రాణాలను హరించగలను. పోనీ, నీ కోరిక ప్రకారం గాయాలను నయం చేస్తాను. ఆ తర్వాతనైనా నాకు దాసుడవయ్యేందుకు ఒప్పుకో!" అన్నాడు హరి.

"ముందీపని కానీ" అన్నాడు కనకుడు. వెంటనే శ్రీహరి తన మృదువైన కరపద్మములతో కనకుడి శరీరాన్ని స్పృశించాడు. అంతే! కనకుడు ఏదో చెప్పరాని దివ్యానందానుభూతిని చవి చూశాడు. అద్భుత శక్తి-విద్యుత్తులా తనలోకి ప్రవహిస్తున్నట్లనిపించింది. క్షణంలో గాయాలన్ని మాయమయింది. ఈ విచిత్ర పరిణామానికి అతడి మనసు ఊహించని ఆనందాన్ని అనుభవించింది. ఒకసారి అతడిలో భయము, ఆశ్చర్యము, ఆనందము, వినయము, భక్తి మున్నగు భావాలు చోటుచేసుకుంది. నోట మాట పెగల్లేదు. అలాగే నిశ్చేష్టుడై వున్నాడు.

అప్పుడు శ్రీహరి "కనకా! నీ గాయాలన్ని పోగొట్టాను. ఇక నీవు నాదాసుడవైతే సదా నిన్ను రక్షింపగలను." అన్నాడు.

ఆ మాటలు విన్న కనకుడికి ఏదో నిగూఢార్థం స్ఫురించింది. "దాస-సదా"-"దాస-సదా" ఆహా! శ్రీహరికి నాపైన ఎంత వాత్సల్యము!

నేను దాసుడనైతే సహా కాపాడుతాడట. సంశయంలేదు. నన్ను తరింప జేయాలనే శ్రీహరి వచ్చాడు. యుద్ధభూమిలో నా కుపదేశం చేసేందుకు అదే పనిగా ఏతెంచాడు, ఆహా? ఇతడికి నేనంటే ఎంత దయ!

"స్వామీ! జగద్రక్షకా! ఆపద్బాంధవా! శ్రీహరీ! "దాసోహం-దాసోహం"-అంటూ పరవశించి, గట్టిగా అన్నాడు. చేతులెత్తి ప్రార్థించాడు.

వెంటనే శ్రీహరి, శంఖచక్రగదా ధారియై – చిఱునవ్వులు చిందిస్తూ నిజరూపంతో ప్రత్యక్షమయ్యాడు. ఆ లీలా మానుష రూపాన్ని తిలకించిన కనకుడిలో పూర్వ జన్మ పుణ్య దివ్యజ్ఞానం మేల్కొన్నది. తనువు పులకరించింది. బ్రహ్మానందంతో పొంగిపోయాడు. పలుమార్లు శ్రీహరి పాదాలకు నమస్కరించాడు. చుట్టూ తిరిగాడు. అవ్యక్తానుభూతిని పొందాడు.

"పురుషోత్తమా! నాలోని అజ్ఞానాన్ని రూపుమాపి నన్నను గ్రహించటానికి వచ్చావా? ఏమి నాభాగ్యం! నేను నీదాసాను దాసుడను. పతిత పావనా! అనాథ రక్షకా! నా అపరాధములను మన్నించు. ఇంతకాలం సత్యస్వరూపుడవైన నిన్ను తెలుసుకోలేక పోయాను. ఎవరు నన్ను విడచినా నీవు మాత్రం సదా నన్ను కాపాడుతూ వుంటావు. నేను నీకు దాసుడనైతిని స్వామీ! నేను ఎప్పుడు కోరితే అప్పుడు నీదర్శన భాగ్యం లభించేలా అనుగ్రహించు." అని ప్రార్థించాడు

దానికి శ్రీహరి "కనకా! నీ కోరికను మన్నించాను. ఏదో ఒక రూపంతో నీవు కోరినప్పుడల్లా కన్పిస్తూంటాను" అని అదృశ్యమయ్యాడు.

బాలలూ! మొండిగా వున్న కనకనాయకుడు హరికి దాసుడైపోయాడు.

"శ్రీహరి సంకల్పానుసారమే జరిగింది!" అన్నారు దాసులు.

'నిజమేనండీ! చివరికి కనకుడు దాసుడయ్యేందుకు అంగీకరించాడు. శ్రీహరి మహిమలకు అంతులేదు. అతడి గాయాలు పోగొట్టి రక్షించాడు.

కర్తవ్యాన్ని బోధించాడు. సూక్ష్మాన్ని తెలుసుకున్న కనకుడు దాసుడయ్యేం దుకు ఒప్పుకోవటం సమంజసమే మరి?' అన్నాడు ప్రసాద్.

ఇకనుంచి మనం 'కనకదాసు' అని పిలుద్దాం అన్నారు దాసులు.

"నేను కూడ హరిదాసుడనయి పోతానండీ! దాసులను సదా కాపాడ టం దేవుడి బాధ్యత. ఈరోజునుంచీ నన్ను 'రామూ! అని పిలవకండి' 'రామదాసు' అనాలి." అన్నాడు రాము.

ఇది మరీ బాగుంది! మనం హరిదాసులమని చెప్పుకుంటే లాభంలేదు. పేరు మార్చుకొని ప్రయోజనం లేదు. శ్రీహరి దయకు పాత్రులైనవారు, అతడికిష్టులైనవారు దాసశ్రేష్ఠులుగా మారిపోతారు. మనం దాసపథంలో పయ నించి శ్రీహరి దయకు పాత్రులం కావాలి. గట్టి ప్రయత్నం చేయాలి అంతే కాని నేను పూజలు-వ్రతాలు-భజనలు చేస్తాను. సదా భగవత్సేవలతో కాల క్షేపం చేస్తున్నాను. దాసులలో నేనే గొప్పవాడినని ఎవరంతకు వాళ్ళను కుంటే ప్రయోజనం శూన్యం. త్రికరణ శుద్ధితో, భక్తితో చేసే పూజలకు ఫలితం వుండి. కానీ కేవలం తనను తాను గొప్పవాడని తలంచి, ఏదో చేయాలి అని పూజలు చేస్తే లాభంలేదు. భగవంతుడి దృష్టిలోపడిన భక్తులే నిజమైన దాసులూ, పుణ్యపురుషులూను. ఇలాంటి వారుచేసే ప్రతిపనీ ధర్మ బద్ధమైవుంటుంది. కానీ వీరు చేసే కార్యాలు లోకులదృష్టిలో అధర్మంగా వున్నా, దేవుడి కిష్టంగా వుంటుంది. భగవంతుడికి ప్రీతి కలిగించనిది లోకా నికి గొప్పదై, లోకులచేత శ్లాఘింపబడినా అది అధర్మమే అవుతుంది. భారత తాత్పర్య నిర్ణయంలో శ్రీమధ్వాచార్యులిలా అన్నారు.

శ్లో॥ ధర్మోఽభవత్య ధర్మోఽపి । కృతోభక్తి స్తవాచ్యుతా ।
పాపం భవతి ధర్మోఽపి । యోన భక్తైః కృతోహరే ॥

శ్రీహరి తనవాళ్ళను తానే గుర్తిస్తాడు. కొందరిని ప్రత్యక్షంగా, మరి కొందరిని పరోక్షంగా హెచ్చరిస్తూ, పరీక్షిస్తూ, రక్షిస్తూ తనదారిలో నడిపిస్తాడు. ముక్తి యోగ్యతను కలిగిస్తాడు.

ఆనాటి నుంచి కనకుడిలో గొప్ప పరివర్తన కలిగింది. అతడి మాట, వేషము, నడక అన్నింటా మార్పు కన్పించింది. నిరాడంబరుడై, సాధు స్వభావుడై వర్తించాడు. కావి బట్టలు ధరించాడు-ఏకతార-చిటితలు చేత పట్టుకుని, గొంగళి భుజాన వేసుకొని తిరుగసాగాడు. ప్రతినిత్యం చెన్నకేశవుడి ఆలయానికి వెళ్ళి త్రికరణశుద్ధితో పూజలు చేసేవాడు. శ్రీహరి నామ జపాన్ని చేసేవాడు.

తల్లిదండ్రులు-భార్యాబిడ్డలు లేని తనకు శ్రీహరి ఒక్కడే దిక్కని భావించాడు :

"జనని జనక నీనె ఎందు । నెనెవెనయ్య దీన బంధు
ఎనగె ముక్తి పాలిసెందు । అనిరుద్ధనె"

అని ప్రార్థించాడు. భగవదనుగ్రహంతో జీవుడిలో జ్ఞానజ్యోతి వెలిగిన వెంటనే అజ్ఞానాంధకారం తొలగిపోతుంది. అప్పుడు సుఖ దుఃఖాల కతీతుడై - అన్నింటా భగవంతుడ్ని భావించుకుంటూ, ముక్తి యోగ్యుడై భాసిస్తాడు. ఇలాంటి జీవుడే దేవుడికి ప్రీతిపాత్రుడు. కనుకనే భగవద్గీతలో కృష్ణ పరమాత్మ ఇలా అన్నాడు :

శ్లో॥ యోన హృష్యతి నద్వేష్టి । నశోచతి నకాంక్షతి ॥
శుభాశుభ పరిత్యాగీ । భక్తిమాన్సమే ప్రియః ॥

'ఏ భక్తుడైతే రాగద్వేషాలకు, సుఖ దుఃఖాలకు లొంగడో, తానుచేసే పాపపుణ్యాలను నాయందే సన్యసించునో- అట్టివాడు నాకు ప్రీతిపాత్రుడు' అని స్పష్టంగా చెప్పాడు.

కనకుడిలో కలిగిన హఠాత్పరిణామానికి ప్రజలంతా ఆశ్చర్యపడ్డారు. కనకుడికి పిచ్చిపట్టిందని కొందరనుకొన్నారు. 'ఉన్న అధికారాన్ని, సంపదను వదలుకొని సన్యాసియై పోయాడే! పాపం! ఎవరి కర్మ వారిది.' అని మరికొంద రనుకున్నారు.

'ఇతడు జ్ఞాని. దైవాంశ సంభూతుడు. భగవదనుగ్రహం గలవాడు. పుణ్యాత్ముడు అని భగవంతుడిపైన విశ్వాసం గలవారు అనుకున్నారు.

మిత్రులు కొందరు "కనకనాయకా! ఏమిటీ వైపరీత్యం! ఎందులకీ వైరాగ్యం! మాకు నాయకుడుగా వుండి, పన్నులు వసూలు చేయి. ప్రజలను పరిపాలించు." అని హితం చెప్పారు.

కనకుడు నవ్వి 'ఏమిటీ! నేను ప్రజలను పరిపాలించడమా? విశ్వరక్షకుడు. ప్రపంచాన్నే పరిపాలించే శ్రీహరి వుండగా ఆ పనులు చేయటానికి నేనెవడ్ని? ఇకపోతే పన్నులు వసూలు చేయాలా? అపన్నుల నాదుకునే ఆది దేవుడికి 'భక్తి' అనే పన్నులు చెల్లించి, శాశ్వతమైన 'ముక్తి'ని పొంది తరించండి. అని బదులు చెప్పాడు. దాసపథంలో ప్రయాణం సాగించాడు.

కనకుడు బాల్యంలో చదువుపట్ల అశ్రద్ధ చేయటంవల్ల, చక్కగా వ్రాయటానికి, గ్రంథాలు చదవటానికి సాధ్యపడలేదు. ఇప్పుడు తాను గొప్ప గొప్ప పుస్తకాలు చదువలేడు. శ్రీహరిని కీర్తించటానికి వలసిన శాస్త్ర జ్ఞానము, బుద్ధికుశలత, పాండిత్యము లేకపోయిందే! అని విచారించాడు.

'సాక్షాత్తు శ్రీహరి కరుణవడసిన నాకీ విచారమెందుకు?' అతడి సంకల్పం వుంటే పామరుడు పండితుడు కాగలడు. సమస్త విద్యలకు అతడే మూలము. అట్టివాడు నన్ను విద్యావంతుడ్ని చేయలేడా?' అని తనకు తానే సమాధాన పరచుకున్నాడు.

చూశారా! చిన్నవయసులో విద్యాభ్యాసాన్ని నిర్లక్ష్యం చేసినా, తల్లి దండ్రులను, ఉపాధ్యాయులను గౌరవించకపోయినా చివరికి బాధపడాల్సి వస్తుంది. బాల్యంలో బడికి సక్రమంగా వెళ్ళక, సినిమాలూ, షికార్లంటూ కాలాన్ని దుర్వినియోగం చేస్తే ఎంత అనర్థమో ఆలోచించండి! భగవంతుడి దయను పొందినవాడు కనకుడు! మరి అందరూ మహనీయులు కాగలరా!

కనకదాసు చెన్న కేశవుడి సన్నిధిలో తన మనోవ్యధను గురించి చెప్పుకున్నాడు. శ్రీహరిని ధ్యానిస్తూ తన్మయత్వంతో వున్నాడు. అప్పుడత డికి తెలియకుండానే పాటలు, పద్యాలు వెలువడ్డాయి. 'శోకం నుంచి శ్లోకం' పుట్టినట్లు ఆవేదనలో ఆశుకవిత్వం దొర్లింది లక్ష్మీపతి గుణగణాలను స్తుతించేందుకు వాగ్దేవత అతడి జిహ్వాగ్రంపైన చిఱునవ్వుతో చిందులు వేసింది.

"ఈశ నిన్న చరణ భజనె ఆశయింద మాడువెను
దోషరాశి నాశమాడొ శ్రీశ కేశవా'

అంటూ కేశవ నామాలను పాడాడు. తన పాటను ఆదికేశవుడికే అంకితం చేశాడు. శ్రీహరి దయవుంటే తక్కిన దేవతలందరి దయా లభి స్తుంది. ఆ కమల సంభవు రాణి, కంజాతలోచని, కళల ప్రసాదించు కల్ప వల్లి కరుణాకటాక్షంతో కనకదాసు కవిత అల్లసాగాడు. అతడు పల్కింది కవిత్వంగా మారింది.

ఎలా తనకు లభించిన సంపదను సత్కార్యాలకు వినియోగించాడో; అలాగే తన కొదలిన కవితాశక్తిని శ్రీహరి మహిమలను వర్ణించేందుకు, లోకాన్నుద్ధరించేందు కుపయోగించాడు. కులమత భేదాలను రూపు మాపేం దుకు, మూఢాచారాలను వమ్ము చేయటానికి తన కవిత్వాన్ని సాధనంగా చేసుకున్నాడు తన నిజజీవితంలో జరిగిన, సత్యసమ్మతములైన సంఘట నలను ఉదహరిస్తూ లోకానికి మేలుకొలుపు పాడాడు. 'భక్తి' గలవారికి

భగవంతుడు పలుకుతాడని, తాను నమ్మిన సత్యాన్ని లోకానికి చాటేందుకు కృషి చేశాడు. ఎవరు తమకు లభ్యమైన కవితాసంపదను భగవత్పరమైన రచనలకు, లోకోద్ధరణకు ఉపయోగిస్తారో వారు ధన్యులు. పోతన, మొల్ల మున్నగువారు తమ కవిత్వాన్ని భగవంతుడ్ని వర్ణించేందుకు వాడు కున్నారు.

మహనీయులు తాము తరిస్తూ, ఇతరులను తరింపజేస్తారు. సత్య పథాన్ని అనుసరిస్తారు.

దాసదీక్షను పూనిన కనకదాసును చూసి కొందరు అవహేళన చేశారు. మరికొందరు పనిగట్టుకొని, "ఎక్కడయ్యా దేవుడు ? నీవు చూసిన హరిని మాకు చూపగలవా ?" అనడిగారు. అప్పుడు కనకదాసు

'ఎల్లిరువనో రంగ ఎంబ సంశయబేడ
ఎల్లి భక్తరు కరెయ అల్లి బందొదగు వను ॥ప॥
తరళ ప్రహ్లాద హరి విశ్వమయనెందు
భరద్యోదయలవన పిత కోప దిం
స్థిరవాదడి కంభదలి తోరు తోరెనలు।
భరదింద బరలదకె వైకుంఠ నెరమనెయ।

అంటూ పాటపాడి-అజామిళుడు—గజేంద్రుడు-ద్రౌపది-మార్కం డేయుడు మున్నగువారు ఆపత్సమయంలో స్మరించగా భగవంతుడు వచ్చి వారిని రక్షించలేదా ? విశ్వతోముఖుడు-సర్వాంతర్యామి అయిన దేవుడ్ని ఎక్కడున్నాడని ప్రశ్నించటంకన్నా ఎక్కడలేడని ! భావించటం సము చితం. సృష్టికర్త మొదలుగా అణురేణు తృణ పర్యంతమూ పరిపూర్ణుడై శ్రీహరి వ్యాపించి వున్నాడు. తనను స్మరించే వారి హృదయాలలో నివసిస్తున్నాడు.

'అణుమహత్తి నొళెల్ల పరిపూర్ణ విశ్వమయ।
గణనె యిల్లద మహా మహిమ నెనిష।
ఘన కృపానిధి కాగినెలి యాదికేశవను।
నెనెదవర మన దొళిహనెంబ బిరుదు ఉంటాగి'

అని చక్కగా వివరించాడు.

ఇలాంటి అనేక సందర్భాలలో, క్లిష్ట సమయాల్లోనూ, చెక్కు చెదరని ఆత్మవిశ్వాసంతో పెక్కు ఉదాహరణలతో ప్రజలను ప్రబోధితుల్ని చేయ ప్రయత్నించాడు. భగవద్భక్తులను చూసి కొంటె ప్రశ్నలు వేసే వారూ, వెక్కిరించేవారూ అన్ని కాలాల్లోనూ వుంటారు. అలాగే ఆదరించే వారు, విశ్వసించేవారూ వుంటారు కూడా।

బాలలూ। ఎంతటి వేదాంత జ్ఞానులకైనా, సద్గురూపదేశం ముఖ్యం. అది లేకుంటే సార్ధకత వుండదు ముక్తి లభించటానికి గురుసేవ అవసరం. నిజమైన సద్విద్యను గురుముఖతా అభ్యసించాల్సిందే।

"గురువిన గులాము నాగువతనక దొరయదన్న ముకుతి"

"గురులేక ఎటువంటి గురుతు కలుగబోదు"

అని ప్రముఖ వాగ్గేయకారులు స్పష్టపరచి వున్నారు.

"గురుకృపా అంజన పాయోమేరే భాయీ" అన్నాడు కబీర్‌దాసు.

శిష్యులయొక్క అజ్ఞానాంధకారాన్ని తొలగించి వారిలో విజ్ఞాన జ్యోతిని వెలిగించువాడు గురువు. వేదాంత భావాలను-మోక్ష సాధనములను శిష్యులకు తెలియజెప్పే సద్గురువులు పుణ్యపురుషులకే లభిస్తారు। కనకదాసు 'తన గురువు ఎవరు ? ఎక్కడున్నాడని' పరితపించాడు.

విశ్వమున కంతటికిని భగవంతుడే గురువు. కనుక గురువును సామాన్య మానవునిగా తలంచరాదు.

"ఆచార్యం మాం విజానీయతో" అని శ్రీకృష్ణుడు చెప్పియున్నాడు. కనుక శిష్యులు భగవంతునియం దెట్టి యుత్తమ భక్తిని గలిగి యుందురు. యట్టి భక్తినే గురువునందు కలిగి వుండవలెను.

సద్గురువు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించును. 'శ్రోత్రియుడు - పావనాత్ముడు-కామ విరహితుడు-బ్రహ్మవేత్త - స్వార్ధ రహితుడై - విశ్వశాంతిని-మానవ కల్యాణాన్ని కాంక్షించువాడే నిజమైన సద్గురువు. అతడు ప్రేమతో అందరినీ సమభావంతో చూస్తాడు. తాను విశ్వసించిన సత్యపథంలో శిష్యులు పయనించునట్లుగా చేస్తాడు.

నిజమైన శిష్యుడు గురునియెడ శ్రద్ధా, భక్తులు గలిగి వినయ విధేయతలతో మెలగాలి. ప్రేమ, గౌరవములతో గురు సన్నిధిలో సత్యాన్వేషణ చేయాలి. ఎప్పుడుగాని గురువును విమర్శింపరాదు. గురుసేవ చేయుటవలన వీరికి యుక్తాయుక్త జ్ఞానము-బ్రహ్మజ్ఞానము లభ్యమవుతుంది. ఆత్మజ్ఞానం కలిగేందుకు సద్గురు కటాక్షం సంపూర్ణంగా వుండాలి.

స్వామి వివేకానందుడు : "మహనీయులగు ఆచార్యులు సాక్షాత్తు భగవదవతార మూర్తులు-స్పర్శచే-కేవల సంకల్పముచే వారు మనలను పరమార్థిక శీలుర నొనర్పగలరు" - వారి మూలముననే భగవంతుని జూడగలము- నిజముగా వారే మనకు అర్చనీయులు" అని వివరించియున్నాడు. శ్రీ రామకృష్ణ పరమహంస తనకు ఆరాధ్యగురువని తెలిపాడు.

"యస్యదేవే పరాః భక్తిః। యథాదేవే తథాగురౌ"

అన్నట్లు. దేవునియం దెట్టి యుత్తమ భక్తి గలదో యట్టి భక్తియే గురువునందు చేయవలెను."

గురువును త్రిమూర్తులతోను-సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపంగాను వర్ణించియున్నారు.

యోగ్యుడైన శిష్యుడికి తగిన గురువు లభించాలంటే శ్రీహరి దయ వుండాలి. హరి కృపకు గురుప్రసాదమే ముఖ్య కారణము. కనుక అర్హులైన వారు గురుభక్తిని సర్వదా కలిగివుండాలి. ఈ విషయాన్ని మధ్వాచార్యుల వారిలా చెప్పి వున్నారు.

శ్లో॥ గురుప్రసాదో బలవాన్. నతస్మాద్బలవత్తరః॥
గురుభక్తిః సదాకార్య స్వోత్తమేష్వఖిలేష్వ పి॥

జీవన్ముక్తిదికి తగిన గురువును ఆ దేవదేవుడే నిర్దేశిస్తాడు. తల్లి దండ్రులకన్నా-భార్యాబిడ్డలకన్నా సద్గురుడే గొప్పవాడు. గురుశిష్య సంబంధము అన్ని బంధములకన్నా మిన్నయైనది. స్మృతులు ఈ విషయాన్ని చెపుతోంది.

'ఓం సహనావవతు। సహనౌ భునక్తు।
సహవీర్యం కరవావహై। తేజస్వి నావధీతమస్తు।
మావిద్విషావహై॥ ఓం శాంతిః శాంతిః శాంతిః॥

—పరబ్రహ్మము గురుశిష్యులమైన మమ్ములను రక్షించుగాక। మమ్ము పాలించుగాక। మేమిరువురమును విద్యాసామర్థ్యములను కలిగి యుందుము గాక। మేమిరువురము పరస్పరము ద్వేషించకుందుము గాక। అధిదైవికము-అధిభౌతికము-ఆధ్యాత్మికములను త్రివిధశాంతులు చేకూరు గాక।

మానవ మాత్రుడైన గురువు మంత్రోపదేశమును — ఇహలోక విద్యలను నేర్పు చేయగలడంతే? సద్గురువగువాడు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదిస్తాడు.

శ్రేష్ఠమైన ధర్మంతో గురుశిష్య బంధము ముడివడి వుంటుంది. శ్రీహరి కటాక్షమునకు పరమగురుని అనుగ్రహం ముఖ్యమని ప్రాణేశదాసుల వారిలా వివరించారు.

హరి మునిదరె గురు కరుణిపనొమ్మిగె – గురుమునిదరె
హరిపొరెయ–హరి కృపకే ముఖ్య గురువె కారణ–

కనకదాసు తన జన్మ సాఫల్యానికి తగిన 'గురువు' అవసరమని భావించాడు. గురువుద్వారా వేదాంత రహస్యాలను, వేదోపనిషత్తులను, శాస్త్ర పురాణాదులను, శ్రీహరి మహిమలను తెలిసికోవాలని అతడి మనసు తహ తహ లాడుతున్నది. సద్గురువును చూపమని భగవంతుడ్ని ప్రార్థించాడు.

భగవత్తత్వము నెఱుగవలెనని యారాట పడువారికి, భగవంతుడే సద్గురువును చూపుతాడు.

కనకుడు చెన్నకేశవుడి ఆలయానికి వెళ్ళి పూజలు సలిపాడు. సద్గురువును చూపి మనశ్శాంతిని కలిగించమని అర్థించాడు. అప్పుడు శ్రీహరి "కనకా! నీవు వెంటనే బయలుదేరి విజయనగరం చేరుకో. అక్కడ వ్యాసరాయలు శిష్యులకు జ్ఞానబోధ చేస్తున్నాడు. అతడే నీ గురువు. అతనిని సేవించి నీ జన్మను సార్థం చేసుకో! నీకు శుభము కలుగుతుంది" అని ఆదేశించి అంతర్ధానమయ్యాడు.

కనకుడు పొంగిపోయాడు. శ్రీహరికున్న వాత్సల్యానికి పరవశించి పోయాడు. శ్రీహరీ! శ్రీహరీ! వ్యాసరాయా! వ్యాసరాయా! అని హరి గురువులను స్మరించుకొంటూ ఆ రోజంతా గడిపాడు.

మరుసటిదినం వేకువనే లేచి కాలకృత్యాలను ముగించుకుని గుడికి బయలుదేరాడు. శ్రీ చెన్నకేశవుడ్ని తనివితీరా దర్శించాడు. సాష్టాంగ దండప్రణామా లాచరించాడు. అతడితో తనకు వియోగం కలుగుతోందని వాపోయాడు. మళ్ళీ అతడి దర్శన భాగ్యం ఎప్పుడు కలుగునోయని దుఃఖించాడు.

"దేవా ! నీ ఆజ్ఞను తల దాల్చుస్తాను. ఇప్పుడే విజయనగరం వెళ్తాను. కానీ నే నెక్కడున్నా నిన్ను స్మరించినంతనే నీ దివ్యమంగళ రూపం నా కన్నులకు కట్టినట్లుగా కన్పించాలి. పునర్దర్శన భాగ్యం ప్రసాదించు" అని ప్రార్థించాడు. ఆ గ్రామాన్ని వదలి విజయనగరానికి బయలుదేరాడు. గ్రామస్థులు, బంధుమిత్రులు అంతా విచారగ్రస్తులై కనకుడికి వీడ్కోలు చెప్పారు. 'ఋణానుబంధరూపేణ పశుపత్ని సుతాలయా' అని ఆర్యోక్తి. ఇహలోకంలో పశువులు, భార్య, బిడ్డలు, స్నేహితులు ఋణాను బంధమున్నంత వరకే మనతో కలిసి వుంటారు.

ఒకప్పుడు మంచి నాయకుడుగా విజయనగర ప్రభుత్వాధికారులచే గుర్తింపబడి, ప్రసిద్ధిగాంచిన 'కనకుడు' ఇప్పుడు సర్వసంగపరిత్యాగియై 'దాస' వేషంతో అదే నగరానికి బయలుదేరుతున్నాడు.

'విజయనగరం' అంటే శ్రీకృష్ణదేవరాయలు – తిమ్మరుసు పరిపాలించిన రాజ్యం కదండి !' అన్నాడు ప్రసాద్.

"అంతేమరి. అష్టదిగ్గజ కవులతో అలరారిన భువనవిజయ సభ ఆనాటిదే" అంది సుభద్ర.

"అవ్వాజీ !' పాఠంలో విజయనగర రాజుల చరిత్ర చక్కగా వర్ణించారు. సాహితీ సమరాంగణ సార్వభౌముడి కీర్తి ప్రతిష్ఠలు ప్రపంచ వ్యాప్తములు" అన్నాడు రాము.

బాలలూ ! మీరు చెప్పింది నిజం. తిరుమలేశుని కొలిచినది కూడా విజయనగరాధీపతే! తిమ్మరుసు బాల్యంలోనే తనపైపడ్డ కుటుంబభారాన్ని మోయలేక, తిరుపతి శ్రీనివాసుని దర్శించి, మనసారా సేవించి, అతడి అనుగ్రహాన్ని పొందికదా ! అంతటి మహామంత్రియై రాణించాడు.

కనకదాసు ఆ నగరానికే వెళ్తున్నాడు. అతడి మనసు ఆనందో త్సాహంతో పరవళ్ళు తొక్కుతోంది! గురువు చెంతకు పోతున్నానే అంతటి కుతూహలంతో వున్నాడు. వ్యాసరాయలు తక్కువ కులంలో జన్మించిన తన్నాదరిస్తాడా! తక్కిన శిష్యబృందం తన్ను మన్నించి చేర్చుకొంటుందా! లేక దూరంగా వుంచుతుందా! అని అతడి మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తోంది. త్వరత్వరగా వెళ్ళాలి! గురువుగారిని చూడాలి. అసలు శ్రీహరి స్వయంగా నిర్దేశించిన గురువువద్దకు వెళ్ళేప్పుడు, విరుద్ధమైన ఊహలకు తావుంచకూడదని-తనలో తాను సమాధానపడ్డాడు. హరి గురువులను స్మరించుకుంటూ వడివడిగా నడిచాడు. త్రోవలో ఎదురైన ప్రతి గుడికీ వెళ్ళి భగవంతుడ్ని మ్రొక్కుకున్నాడు.

ముళబాగిలులో నెలకొన్న శ్రీపాదరాయల వారి ప్రియశిష్యుడే వ్యాస రాయలు. గురువుచే కీర్తింపబడ్డ చరిత్ర కలవాడు. గురువు ఆదేశానుసారం విజయనగరంలో నివాస మేర్పరచుకొని ప్రజలకు ధర్మోపదేశాలు చేస్తూ, శిష్యులను పోషించి, సన్మార్గగాములుగా చేస్తున్నారు. విజయనగర ప్రభువు లైన సాళువ నరసింహరాయలచే సత్కారాలను పొంది, రాజ్యక్షేమాన్ని కోరినవాడు. ఒకప్పుడు ప్రభువులు తిరుమల ఆలయ పూజారులను హింసిం చిన కారణంగా బ్రహ్మహత్యాపాతకాన్ని పొందినపుడు వ్యాసరాయలు తమ మహిమలతో ఆ దోషాన్ని పరిహరించారు తర్వాత విజయనగర సింహాసనా న్నధిష్టించిన శ్రీకృష్ణదేవరాయల చేత గౌరవ మర్యాదలను అందుకున్న పూతాత్ములు వీరు. ధర్మరక్షకులై, ప్రజలను కన్న బిడ్డలవలె పరిపాలించిన రాజులకు కలిగిన దైవిక విపత్తులను నివారించుటయే తమ కర్తవ్యంగా భావిం చిన మహాత్ములు వీరు. కనుకనే విద్యారణ్యస్వాములు - వ్యాసరాయలు - వైష్ణవాచార్యులు మున్నగువారు మహనీయులుగా భాసించారు.

ఒకసారి శ్రీకృష్ణదేవరాయలకు 'కుహూయోగ' మనే ఆపద సంభవించినది. సాళువ నరసింహునికి పూర్వమున్న ముగ్గురు రాజులు కూడ అల్పకాలంలోనే గతించినారు. అలాగే 'కుహూయోగ' గండం కృష్ణరాయలకు గ్రహగతులవల్ల ఏర్పడి-రాజుకు విపత్తు కలిగిన తరుణంలో వ్యాసరాయలు శాంతి కర్మలుచేసి ఆ దోషాన్ని పోగొట్టారు. కుహూయోగ సంధికాలంలో తానే సింహాసనాధిష్ఠుడై 'వ్యాసరాజుగా' వాసిగాంచిరి. రాజుచే పూజలందుకొన్నారు. ఈ కథ కర్ణాటక గ్రంథాలలో ప్రచారంలో వుంది.

శ్రీకృష్ణరాయలు పలుమార్లు పత్నీసమేతుడై తిరుమల శ్రీనివాసుని దర్శించి, సేవించినవాడు. ఈనాటికీ వీరి విగ్రహాలు తిరుమల ఆలయంలో వుంది. హిందువులు గర్వించేలా, హైందవ ధర్మాలను రక్షించటానికి బద్ధకంకణుడై, పరజాతి గుండెల్లో నిదురించిన సింహం రాయలు. ఇతడి పరిపాలన స్వర్ణయుగమై, రామరాజ్యమై ఫలసిల్లింది. ఇట్టి రాజులను-రాజ్యాన్ని రక్షించటం మహనీయులు తమ బాధ్యతగా భావించేవారు.

వ్యాసరాయలు షట్శాస్త్ర పారంగతుడు. జ్ఞానమూర్తి. తపోధనుడు. వేదోపనిషత్సారములను క్షుణ్ణంగా జీర్ణించుకున్నవాడు. శాంతగంభీరుడు. విషయదూరుడు. త్రికరణశుద్ధితో శ్రీమన్నారాయణుని పూజిస్తున్నవాడు. ఆత్మజ్ఞానానందాన్ని అనుభవిస్తూ, శిష్యులను ప్రబోధిస్తున్న పవిత్రుడు. బహు గ్రంథకర్త. ప్రజలు వీరి ఉపదేశాలను వినేందుకు వచ్చేవారు.

వ్యాసరాయలు ద్వైత మతాచార్యుడైన శ్రీమధ్వాచార్యుల వారి మతావలంబికుడు. ఇతడే తరువాతి జన్మలో మంత్రాలయ ప్రభువులైన శ్రీ రాఘవేంద్రులుగా కూడ అవతరించాడు. భగవదాదేశాన్ని తలదాల్చి లోకులకు జ్ఞానోపదేశం చేయటానికే ఇలాంటి అవతార పురుషు లుద్భవిస్తారు. అంతేకాని తామే దైవస్వరూపమని, తమ మహిమలే గొప్పవని లోకాన్ని వంచించటానికి కాదు.

'శ్రీ రాఘవేంద్రస్వామి। అంటే గురురాజు' నేను గాయత్రి సిని మాలో శ్రీ రాఘవేంద్రులవారి మహిమలు చూశానండి." అంది గాయత్రి.

'మంత్రాలయ రాఘవేంద్రుల మహిమలు ప్రపంచ వ్యాప్తములు. అంధులకు దృష్టి వస్తుంది. మూగవాళ్ళకు మాటలొస్తాయి. కుంటివాళ్ళు నడు స్తారు. శ్రీ రాఘవేంద్రస్వామికి ప్రదక్షిణ నమస్కారాలు చేస్తే కుష్ఠాది రోగాలు పోతాయి' అన్నాడు ప్రసాద్.

'నేను మంత్రాలయం చూశానండి। మూడురోజులు స్వామివారి సేవ చేశాను. తుంగభద్రానదీ తీరంలో వెలసిన గురురాజు ఆర్తుల కష్టాలను తొల గిస్తాడు. వేలాది భక్తులు వచ్చి సేవలు చేస్తుంటారక్కడ. ఆలయంలో నిర తాన్నదానం చేస్తుంటారు. ఇలా అన్నదానం చేసే దివ్యక్షేత్రాలు ఈ కాలంలో ఎక్కడన్నాయండి।' అన్నాడు వంశీ.

"ఎందుకు లేదు నాయనా। 'ఉడపి' క్షేత్రంలో నిరతాన్నదానం చేస్తున్నారు. ఇంకా ఎన్నోచోట్ల చేస్తూంటారు. మనకు తెలిసినవి కొన్ని ప్రాంతాలే. ఒకప్పుడు తిరుమలలోనూ అన్నదానం జరుగుతూండేదట."

"వ్యాసరాయలు - రాఘవేంద్రులు ఒక్కరే। శ్రీహరిసేవలు చేస్తూ, తమ గురువులైన మధ్వాచార్యులు ప్రతిపాదించిన ద్వైతమతాన్ని అనుసరించి, లోకానికి మేలు చేస్తున్న మహాత్ముడు రాఘవేంద్రస్వామి।" అని వేంకట దాసుల వారు భక్త్యావేశంతో ఇలా పాట పాడారు.

1. శ్రీ రాఘవేంద్రం యతీంద్రం ।
   రామచంద్రాంఘ్రి పద్మేసదాసక్త భృంగం ॥శ్రీ॥
   పార్థోపదేశార్థగానం పుణ్యమాధ్వీకమూలం ।
   భజేభక్తపోషం ॥శ్రీ॥

2. మంత్రాలయే తుంగభద్రా
దివ్యనద్యాస్తటాంతోల్ల సత్కల్ప వృక్షం
దూరీకృతత్ర్యంబకారిం
మర్త్య పాపాద్రి సంభేద సద్దృష్టి వజ్రం ॥శ్రీ॥

3. ప్రహ్లాద దేవాంశ జాతం
మత్తవాదీభ కుంభోదళద్రాజ సింహం ॥
శ్రీమధ్వసిద్ధాంత గర్భాం
తత్వభేరించ సన్నాదయంతం సమంతాత్ ॥శ్రీ॥

4. విద్యా విహీనశ్చ బాలః ।
పత్రపాఠేనియుక్తో నృపేణార్థ బుద్ధ్యై ।
యద్యోగి చింత్యా ప్రభావాత్ ।
సోఽపి సంయక్ పపాఠాభి నంద్యో భవచ్చ ॥శ్రీ॥

5. రాజా తురుష్కోఽపి యస్మై ।
మాంసపిండాన యచ్ఛత్ ప్రసజః కైతవేన ।
యేనక్షణాత్ ప్రోక్షమాణాః ।
గంధమాల్యాన్యభూవత్ నృపశ్చాప కంపమ్ ॥శ్రీ॥

పిన్నలూ, పెద్దలూ అనిర్వచనీయమైన ఆనందానుభూతిని పొందారు. వేంకటదాసులు ఆనందభాష్పాలు రాల్చారు. బాలలూ! ఈ పాటను మద్రాసు తిరువలిక్కేని పార్థసారథి సన్నిధి వీధిలో నివసిస్తున్న శ్రీ సత్యనారాయణ రావు ఆశువుగా రచించాడు. ఆయన తిరుపతిలో చదువుతున్న రోజుల్లో తఱచు తిరుమల కొండకు వెళ్ళి వచ్చేవాడు. ఒకసారి నేను వీరితోబాటు కాలి నడకన కొండఎక్కాను. శ్రీ సత్యనారాయణరావుగారు సంస్కృతంలో అనర్గళంగా ఉపన్యాసాలు చేస్తూండేవారు. నేను వారితో 'మీరు ఆశువుగా పద్యాలు

చెప్పలేరా ?' అని ప్రశ్నించాను. 'ఎప్పుడూ చెప్పలేదు' అన్నారు. 'ప్రయత్నించండి' అన్నాను. అప్పుడు మేమిరువురం మోకాళ్ళ మిట్ట ఎక్కుతున్నాం. "ఎవరిని గురించి చెప్పాలి ?" అన్నారాయన. 'మంత్రాలయ ప్రభువులను గురించి చెప్పండి ' అన్నాను. అప్పుడు శ్రీనివాసుని స్మరించి-తన్మయత్వంతో గురురాజుల పైన ఆశువుగా పై శ్లోకాలు పాడారు. అటో ఆనందానుభూతి ఏడుకొండలవాడి దయతో అతడి భక్త శ్రేష్ఠుడైన గురురాజుల వారిపై కవిత్వం ఆశువుగా చెప్పగల్గటం – మధురానందదాయకం. అదీ తొలి ప్రయత్నంగా సాగిన రచన. సందర్భం వచ్చింది కనుక ఇప్పుడు ఈ సంఘటనను వివరించాను. అని మళ్ళీ :

శ్లో॥ పూజ్యాయ రాఘవేంద్రాయ । సత్యధర్మరతాయచ ।
భజతాం కల్ప వృక్షాయ । నమతాం కామధేనవే ॥

భగవద్భక్తుడు, యోగిపుంగవుడు, పూజ్యుడైన శ్రీ రాఘవేంద్రుల వారిని భజించి, నమస్కరిస్తే – కల్పవృక్షంలాగా, కామధేనువులాగా కోరిన కోర్కెలను తీరుస్తాడు.

శ్రీ రాఘవేంద్రులవారు తిరుమల శ్రీనివాసుడ్ని సేవించిన మహాత్ముడు. 'వేంకటేశుడు గురురాజు యొక్క వశవర్తి' అని శ్రీ గురు జగన్నాథ దాసులవారు ఒక సందర్భంలో వివరించారు.

"ఏను పుణ్యావో నిన్నవశదలి
శ్రీనివాసను సతత ఇప్పను"-

దీనులైన భక్తులకు నానా కామితముల నిచ్చేందుకే గురురాజు మంత్రాలయంలో నివసిస్తున్నాడు ఇక మనం అసలు కథకు వద్దాం.

కనకదాసు వడివడిగా అడుగు లేస్తున్నాడు. మార్గంలో కనపడ్డ ప్రతి ఒక్కరినీ గురువుగార్ని గురించి వారి మహిమలనుగురించి అడుగుతున్నాడు.

విజయనగరంలోని ప్రజలు ఇదివరకే కనకుడ్ని గురించి వినియున్నారు. అతడ్ని చూసేందుకు కొందరు వచ్చారు. కానీ అతడి వేషభాషలు వారికి ఆశ్చర్యాన్ని కల్గించింది. కనకుడు తన గురువుగార్ని గురించి వారినడిగాడు. ప్రజలు వ్యాసరాయలను - వారి మహాత్మ్యములను గురించి చెప్తుంటే పరవశించి వింటూ అక్కడే నిలబడి పోయేవాడు. మళ్ళీ ఆలస్యమైపోతుందని శీఘ్రంగా నడిచేవాడు. అల్లంత దూరాన గురువుగారి మఠం కన్పించింది. పూజ్య గురువుల పుణ్య నివాసము చూసి ఆనందంతో సమీపించాడు ఎదురు చూసిన సమయం ఆసన్నమైంది. అప్పుడు వ్యాసరాయలు శ్రీమన్నారాయణుని గుణగణములను వర్ణించి చెబుతున్నారు

శ్రీ గురుభ్యోనమః - హరిః ఓం<br>
ఓం నారాయణాయ పరిపూర్ణ గుణార్ణవాయ ।<br>
విశ్వోదయ స్థితిలయోన్నియతి ప్రదాయ ॥<br>
జ్ఞాన ప్రదాయ విబుదాసుర సౌఖ్యదుఃఖ ।<br>
సత్కారణాయ వితతాయ నమో నమస్తే ॥

సర్వజగత్తుకు సృష్టి-స్థితి-లయములను కలిగించేవాడా। పరిపూర్ణ గుణములకు సముద్రము వంటివాడా। అనగా గుణపూర్ణుడా। జ్ఞానప్రదుడా। దేవతలకు సౌఖ్యాన్ని, రాక్షసులకు దుఃఖాన్ని ఇచ్చుటయందు ముఖ్యకారణమైనవాడా। సర్వత్రా వ్యాపించినవాడా। నారాయణ శబ్ద వాచ్యుడా। మీకొఱకు నమస్కారము। నమస్కారము। అని ఈ శ్లోకం యొక్క భావము.

ఇచ్చటి పండితులలో ఒకరు 'నారాయణ' శబ్దమునకు అర్ధాన్ని వివరించండి ? అని గురువుగారు ప్రశ్నించారు అప్పుడొక పండితుడు :

నారాః=న అరాః, అరాః=దోషములు, న=కానివి. దోషములు కానివి, గుణములు. వీటికి, అయన=ఆశ్రయుడు. నారాయణ=గుణములకు ఆశ్రయుడు. అని వివరించాడు. మరియొక పండితుడు ఇలా వ్యుత్పత్తిని

చెప్పాడు. "అవతారములయందు నరసంబంధమయిన శరీరమును పొందు వాడు; ఉదక స్థానముగా గలవాడు. శబ్దముల కాధారభూతు డైనవాడు. సారూప్య ముక్తికి స్థానమైనవాడు."

పిమ్మట వ్యాసరాయలు 'నారాయణుడు వితత వ్యాప్తుడు అనగా గుణములచేతను, దేశకాలము లచేతను వ్యాప్తుడని భావము. 'సంపూర్ణ గుణార్ణవాయ' అనగా పరిపూర్ణ గుణములకు సముద్రము వంటివాడు. ఆ పరమాత్మ గుణములను సంపూర్ణంగా తెలిసికున్నవారులేరు. నారాయణుని గుణములు సాక్షాత్తు సన్నిధానవర్తి అయిన లక్ష్మీదేవికే సంపూర్ణంగా తెలియదని శాస్త్రాలు చెపుతోంది. ఇక ఇతరుల విషయంలో ఆలోచించనక్కరలేదు. కనుకనే అతడ్ని "అజాది పూజ్య పాదాయ । నమస్తే గరుడధ్వజ ।" అని నమస్కరిస్తున్నారు.

ఇలా వ్యాసరాయల మధురవాణి 'భారత తాత్పర్య నిర్ణయం' గ్రంథంలోని మంగళాచరణ శ్లోకాన్ని వివరిస్తోంది. పండితులంతా ఆసక్తితో వింటున్నారు. ఈ వేళ గురువుగారెంతో ఉత్సాహంగా ఉంటున్నారు. కారణం తెలియదు. అని శిష్యులంతా అనుకొంటున్నారు. నారాయణుని గుణములను వర్ణించేప్పుడు గురువుగారు అపురూపమైన ఆనందంలో మునిగి తేలుతూంటారు. అని వారిలో వారు మాట్లాడుకోసాగారు । కానీ, కనకుడి వంటి ఉత్తమ శిష్యుడు తనకడకు వస్తున్నాడని ముందుగానే ఊహించిన త్రికాలజ్ఞులు. వీరికి తెలియంది లేదు. ఇది అసలు కారణం' అన్నారు వేంకటదాసులు.

కనకదాసు ద్వారంవద్ద నుండే చేతులు జోడించి గురువుగార్ని సమీపించాడు, భక్తితో పాదాభివందనం చేశాడు.

"స్వామీ ! నేను కనకుడ్ని. మీ సేవకుడ్ని. నన్ను శిష్యుడిగా స్వీకరించండి. మీ వద్ద వేదాంత విద్యలు అభ్యసించాలని వచ్చాను. భక్తి,

జ్ఞాన, వైరాగ్యాలను తెలిసికోవాలని కుతూహల పడ్తున్నాను. మంత్రోపదేశం చేసి నన్ను అనుగ్రహించండి." అని వినయంతో ప్రార్థించాడు.

గురువుగారు కనకుణ్ని పరిశీలనగా చూశారు. కనకుడి ముఖంలో దివ్యతేజస్సు ప్రకాశిస్తోంది. అతడి వినయ విధేయతలకు, మృదు మధురము లైన మాటలకు ముగ్ధులైరి. 'ఇతడు శ్రేష్ఠజీవి ! కారణజన్ముడు !' అను కున్నారు. చిఱునవ్వుతో అతడ్ని దీవించారు నాయనా ! శ్రీహరి కృపకు పాత్రుడవైన నీవు ధన్యుడవు నీ పుణ్యచరిత్ర ఈ పుడమిపై శాశ్వతంగా నిలచిపోతుంది. నిన్ను శిష్యుడిగా స్వీకరిస్తున్నాను. ఆశ్రమధర్మాలు - పద్ధతులు చక్కగా అవలంబిస్తూ, ఇక్కడి పండితులతో, శిష్యులతో కలసి వుండు.' అని ఆదరించారు.

బాలలూ ! పెద్దలయెడ వినయవిధేయతలతో మెలగాలి. మహాత్ముల పైన భక్తి గౌరవాలు కలిగి వుండాలి. కచుడు వినయంతో, మృదుమధుర మైన మాటలతో శుక్రాచార్యులవారి హృదయాన్ని ఆకర్షించాడు. అతడిని సేవించి మృతసంజీవనిని సంపాయించాడు.

'విద్యాదదాతి వినయం' అని ఆర్యోక్తి. విద్యవలన వినయము పెర గాలి తద్వారా సంఘంలో గుర్తింపు ఏర్పడుతుంది. ఎంత చదువు చది వినా, ఎంత సంపద వున్నా 'వినయగుణం' లేకపోతే విలువలేదు 'నిండు కుండ తొణకదు' పండ్లభారంతో చెట్టు వంగి వుంటుంది. పండ్లకోసం చెట్టును రాళ్ళతో కొట్టినా వారికూడా తియ్యటి పండ్లను ఇస్తుంది.

గాలి వీచినపుడు, నీటి ప్రవాహంలో గడ్డిపోచ వంగుతుంది. మహా వృక్షాలు నిటారుగా వుండి పెనుగాలికి పడిపోతాయి. ప్రవాహంలో కొట్టుకు పోతుంది.

మనం అంజనేయుడి కథ చెప్పుకున్నాం కదా ! మహాబలవంతుడైన అతడు ఎన్నో ఘనకార్యాలను సాధించాడు. సముద్రాన్ని అవలీలగా

లంఘించాడు. సీతాదేవికోసం లంకంతా గాలించాడు. ఎంతోమంది రాక్షసులను సంహరించాడు. అశోకవనాన్ని నాశనం చేశాడు. రావణుడి గర్వాన్ని అణచివేశాడు. లంకను కాల్చాడు. సంజీవనీ పర్వతాన్ని తెచ్చి లక్ష్మణుడి ప్రాణాల్ని కాపాడాడు'—ఇంతటి హనుమంతుడు తాను శ్రీరామబంటునని అందరికీ చెప్పాడు. అశోకవనంలోని రాక్షసులు 'ఎవరు నీవు? ఈ వనాన్నెందుకు నాశనం చేస్తున్నావు?' అని ప్రశ్నించారు అప్పుడు హనుమంతుడు 'దాసోహం కోసలేన్ద్రస్య' – నేను శ్రీరామచంద్రుని దాసుడ నంటాడు.

ఇంతటి బలశాలి అలా పల్కటంతో రాక్షసులు ఆశ్చర్యపోయారు। రాముడి దాసుడే ఇంత ప్రతాపవంతుడై, అసాధ్యుడుగా వున్నపుడు ఆ రాముడెంతటి బలవంతుడై వుంటాడో కదా । అని భయపడ్డారు.

వజ్రకాయుడైన హనుమంతుడెంతటి బలవంతుడో – అంతటి వినయ సంపదగలవాడు సంజీవనీ పర్వతాన్ని సునాయాసంగా తెచ్చినవాడు శ్రీరామచంద్రుడి పూజ కొఱకు పారిజాత కుసుమాలను రెండు చేతులతో, నలగకుండా, క్రింద పడిపోకుండా భక్తి శ్రద్ధలతో, వినయ విధేయతలతో తీసుకొచ్చేవాడట. ఈ విషయాన్ని నారాయణాచార్యులు శ్రీ సుమధ్య విజయమనే గ్రంథంలో చక్కటి శ్లోకంతో వర్ణించియున్నారు.

శ్లో॥ రామార్చనేయో నయతః ప్రసూనం॥
ద్వాభ్యాం కరభ్యా మభవత్ప్రయత్నః॥
ఏకేన దోష్ణా నయతో గిరీంద్రం॥
సంజీవనాద్యా స్వయమస్య నాభూత్॥—

కనుక 'వినయగుణాన్ని అలవర్చుకోవాలి' అన్నారు వేంకటదాసులు. కనకదాసు గురువుగారి ఆదరణకు, ఆప్యాయతకు పొంగిపోయాడు. కానీ అచటి పండితులు కనకుడు అల్పజాతివాడన్న భావంతో

పట్టిపట్టి చూడసాగారు. భుజాన గొంగళి, చేతిలో నున్న పెద్దకర్ర, బోసి వేషము అతడికి సౌందర్యాన్ని కల్గించిందని నవ్వుకున్నారు. పై పెచ్చు తత్వార్థం తెలిసికోవాలని వచ్చాడట ! అని వెక్కిరించారు.

బాలలూ ! ఈ సందర్భంలో కర్ణాటక ప్రాంతంలో ప్రచారంలో నున్న కథ ఒకటి చెపుతాను. కనకదాసుకు – వ్యాసరాయలవారికి మధ్య జరిగిన వింత సంఘటన ఒకటుంది. గురువుగారిని వెతుక్కుంటూ కనక దాసు బయలుదేరాడు. అప్పుడు వ్యాసరాయలు మదనపల్లి ప్రాంతంలోని వ్యాస సముద్రాన్ని కట్టిస్తున్నారు. లక్ష్మీనారాయణ తోపులో కూలీలంతా పని చేస్తున్నారు. అక్కడ అడ్డంగా పడివున్న పెద్దపెద్ద బండరాళ్ళను ఎలా తీయించాలోనని గురువుగారు ఆలోచిస్తున్నారు. అప్పుడు కనకుడు అక్కడికి వచ్చి 'స్వామీ' నేను కనకుడ్ని. అని నమస్కరిస్తాడు.

గురువు : 'ఎక్కడి కనకుడివయ్యా !' ?

కనక : కురుబజాతిలో పుట్టిన కనకుడిని.

గురువు : ఓహో పాలెగాడివా ?

కనక : కాదు స్వామి, సామాన్యుడను.

గురువు : ఏ పనిమీద వచ్చావు ?

కనక : మంత్రోపదేశం పొందాలని వచ్చాను.

గురువు: గొల్లవాడికి మంత్ర మెందుకయ్యా! 'కోణమంత్రం' గాక !

అంటూ నవ్వి, తమపనిలో నిమగ్నులయ్యారు. కనకుడు ఆ మంత్రమే చాలు స్వామీ! అని చెప్పి ఒక నిర్జన ప్రదేశంలో కూర్చొని కోణ మంత్రాన్ని భక్తితో జపించాడు. కురబజాతిలో పుట్టినవాడు ఆవులు, ఎనుములు మేపుకొనక మంత్రోపదేశం కొఱకు వచ్చాడేమిటని గురువుగారు-

గొల్లవాడికి మంత్రోపదేశమా। కోణమంత్రం -అన్నారు 'పోఁతు' అంటే 'దున్నపోతు' అని అర్థం.

కనకుడు గురువుగారి మాటనే మంత్రంగా భావించి జపించసాగాడు' అతని మనశ్శక్తి, అతనిపై భగవంతుడికున్న వాత్సల్యం కారణంగా యమ ధర్మరాజు వాహనమే వచ్చి ఎదురునిలిచి 'ఏమిటి ఆజ్ఞ సెలవీయు' మన్నది. కనకుడు దాన్ని గురువు చెంతకు రమ్మని చెప్పి, గురువుగారితో 'స్వామీ। మీరుపదేశించిన మంత్ర జప ప్రభావంతో ఇది వచ్చిం'దన్నాడు.

గురువుగారు ఆశ్చర్యపడ్డారు. 'భలే। మంచి శిష్యుడివే। 'ఈ దున్నపోతుతో ఆ బండరాళ్ళ తీయించు।' అని చెప్పారు. కనకుడాపని చేయించాడు. గురువుగారు కనకుణ్ని శిష్యుగా స్వీకరించారు। అని కథను ముగించారు.

మహనీయుల చరిత్రలో ఇలాంటి మహిమలను గూర్చిన కథలు అనేకంగా వుంటాయి. భాగవతోత్తముల కథలను విశ్వసించాలి.

కనకుడు ఆ రోజంతా తన అదృష్టాన్ని తలచుకొంటూ ఆనందించాడు. శ్రీహరి గురువుల ప్రేమాను రాగాలకు పొంగిపోయాడు. తన జన్మ సార్థకమైందని తలంచాడు. జరిగిన సంఘటనలను గూర్చి ఆలోచిస్తూ హాయిగా నిద్రపోయాడు.

కానీ, బ్రాహ్మణ పండితులకు నిద్రపట్టలేదు. కురబవాడికి ఆశ్రమంలో ఆశ్రయమివ్వరాదు. గురువుగారు పొరపాటు పనిచేశారు. వీరి కీర్తి ప్రతిష్ఠలకు భంగం వాటిల్లే పని చేశారు. ఇంతకాలం కనకుడు రజోగుణ ప్రధానమైన మద్య మాంసాదులను సేవించాడు. ఉన్నట్లుండి దాసుడిగా ఎలా మారిపోతాడు. పాత అలవాటు వీడు వదలుతాడా? ఇలాంటి వాడితో కలసి వుండటం మహాపాపం। ఇతడి విషయంలో ఏదో ఒకటి చేయాలి। అనుకుని మనసు పాడుచేసుకున్నారు. దురాలోచన చేసేవాడికి నిద్రపట్టదు.

తెల్లారగానే పూజా కార్యక్రమం ప్రారంభమైంది. శిష్యులంతా వేదాలు వల్లిస్తున్నారు. గంధం తీస్తున్నారు. తులసీ దళాలను, పుష్పాలను గురువుగారికి అందిస్తున్నారు దేవుడికి శంఖోదకంతో అభిషేకం చేస్తున్నారు. మంగళహారతులతో పూజ జరుగుతోంది. కనకుడు భక్తిశ్రద్ధలతో కాస్త దూరం నుంచీ అంతా వీక్షిస్తున్నాడు. కనకుడు తమలో ఒకడుగా వున్నాడని శిష్యులకు ఈర్ష్యగా వుంది. దుష్టభావాలు గలవారికి హరిభక్తి కుదరదు.

పూజ పూర్తయింది. గురువుగారు అందరికీ తీర్థం ఇచ్చారు. కనకుడు పొంగిపోయాడు. పండితులు కృంగిపోయారు. ఆ రోజంతా 'మడి–ఆచారము' అంటూ కనకుడికి దూరంగా వున్నారు. అతడు మాత్రం వీరి చర్యలను పట్టించుకోలేదు. నిండు భక్తితో కీర్తనలు పాడుకొంటూ వుండిపోయాడు. ఇతరుల పట్ల ద్వేషంగాని– అసహనంగాని అతడిలో లేదు. సత్పురుషులు అణకువ గలిగియే ఔన్నత్యాన్ని పొందగలరు. సుఖదుఃఖాలను సమంగా చూస్తారు. గీతాచార్యుడు:

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణ ఏవచ।
నిర్మమో నిరహంకారః
సమదుఃఖ సుఖక్షమీ॥

అని వివరించాడు। ఉత్తమ భక్తుడు సమస్త భూతముల యందును ద్వేష భావములు లేక దయా సుహృద్భావములు గలిగి వుంటాడు. అహంకార వర్జితుడై, సుఖదుఃఖాలను సమంగా భావించి ఓరిమి గలిగి వుంటాడు।

ఆ మఠంలోనే పురందరదాసు గురువుగారిని సేవిస్తూ, కీర్తనలు రచిస్తూ కాలం గడుపుతున్నాడు. మనము ఇతడి కతను లోగడ చెప్పుకున్నాం।

'దాసరందరె పురందర దాసరయ్యా।' అని గురువుగారిచే పొగడబడినవాడితడు. కనకదాసు కితడు చేరువయ్యాడు. పరస్పరం అన్యోన్యంగా సఖ్యత గలిగి వున్నారు. ఇరువురూ దాసశ్రేష్ఠులే. ఇరువురి జీవితాలతోనూ శ్రీహరి ప్రమేయముంది. తఱచుగా వీరికి పరీక్షలు పెట్టి తన దాసులుగా చేసుకున్నాడు. ఇద్దరూ మహదైశ్వర్యాలతో తులతూగినవారే। భగవంతుడి అనుగ్రహానికి పాత్రులైన కారణ జన్ములే। ఈ దాసద్వయం మిత్రద్వయంగా మారటం కేవలం భగవత్సంకల్పం! ఒకడా బ్రాహ్మణుడు, మరొకడు గొల్లజాతివాడు. నిజమైన మైత్రికి కులమతాల విభేదా లుండవు। ఏగూటి పక్షులు ఆగూటికే చేరుతాయి. మనసులు కలసినపుడు- పథములు ఒకటే అయినప్పుడు - గమ్యం చేరటం సులభ సాధ్యమౌతుంది.

'సాధు సాంగత్యము సకలార్థ సాధకము'

"సజ్జన సాంగత్యం సర్వోత్కృష్టమైనది." లోకవ్యవహారంతోబాటు భక్తిజ్ఞాన వైరాగ్యాలను పెంచుతుంది. భగవంతుడి కోసం తాపత్రయపడే సాధకులకు లభ్యమయ్యే లాభం సన్మిత్రుల కూడా లభించి, ధన్యులను చేస్తుంది.

"పుణ్యైర్వినా నహి భవంతి సమీప హితార్థాః"

మంచి మిత్రులు లభించాలంటే పుణ్యం చేసుకొని వుండాలి. సత్కార్యాలు చేయటానికి- సంఘ సంస్కరణకు- పరోపకారానికి - కష్ట సుఖాలను పంచుకోవటానికి సన్మిత్రుల అవసరం ఎంతైనావుండి. ఎలా

వివాహాలు దైవ నిర్ణయాలని చెప్పబడిందో, అలాగే సజ్జన సావాసమూ భగవంతుడి వరంలాంటిది.

కనకుడు కూడా కేశవనామాలలో

సాధుసంగ కొట్టు నిన్న।
పాదభజనె యిత్తు ఎన్న
భేదమాడి నోడడిరు
—అ— ధోక్షజ॥

అని భగవంతుణ్ని ప్రార్థించాడు. పురందరదాసుతోడి స్నేహంతో అతడి కోరిక నెరవేరింది మఠంలోని పండితులు— శిష్యులు మంచివారే। కానీ, వారిలో జాతిమత విభేదాలు— అసూయాద్వేషాలు— పండితులమనే గర్వం చోటు చేసుకుంది.

'మోక్ష ద్వారమందు— శాంతి— విచారము— సంతోషము— సజ్జన స్నేహము' అను నలుగురు ద్వారపాలురు గలరని భాగవతంలో చెప్పబడింది.

మోక్షద్వారే ద్వారపాలా
శ్చత్వారః పరికీర్తితాః।
శమో విచార స్సంతో
షశ్చతుర స్సాధు సంగమః॥

సజ్జనులు ఎక్కడ చేరినా భగవద్విషయాలను గూర్చి చర్చలు జరుపుతారు. క్రొత్తపాతలనేవి వీరిలో వుండదు. ఒకడు సుదూర ప్రాంతాలకు యాత్ర చేసినపుడు, అక్కడున్న సజ్జనులతో పరిచయం ఏర్పడితే,

వారు చిరకాల పరిచయస్తుల్లాగా ముచ్చటించుకుంటారు. తమ జీవితాలలో జరిగిన అనేక విచిత్ర సంఘటనలను,భగవంతుడు తమను ఎప్పు డెప్పు డెలా ఆదుకున్నదీ, అతడి మహిమలు పరస్పరం చెప్పుకుంటారు. మధురాను భూతిని పొందుతారు. కాళ్ళు లేనివారికి కాళ్ళొచ్చాయనీ, చూపులేని వారికి దృష్టి వచ్చిందనీ, మూగవారు మాట్లాడినారని, బిడ్డలు లేనివారికి సంతానం కలిగిందనీ, రోగాలు నయమయిందని ఇలా రకరకాలుగా చెప్పుకుంటారు. దేవుడి మహిమలను గురించి ముచ్చటించేటప్పుడు వారికి కాలంతో గాని, ఇతర వ్యాపకాలపై గాని మనసు మళ్ళదు. సత్యధర్మాలను గూర్చి ప్రసంగాలు చేస్తారు. కనుకనే సజ్జనుల గోష్ఠిని శ్రద్ధతో వినాలి.

'సజ్జనుల గోష్ఠి కదలక
ధర్మంబెఱుగుచు
నెఱిగిన దానిని మరువక
నిష్ఠించునది సమంజసబుద్ధిన్'

అని భారతంలో చెప్పబడింది.



పురందరదాసు- కనకదాసులు తమ తమ అనుభవాలనుగురించి ముచ్చటించుకున్నారు. తన్మయత్వంతో పాటలు పాడారు. పురందరదాసు తనను ఎంత స్నేహభావంతో చూసినా- కనకుడు తానుమాత్రం పురందర దాసును బ్రాహ్మణోత్తముడుగా భావించి గౌరవించాడు. ప్రతిరోజూ గురువు గారి సమక్షంలో వారిరువురు కీర్తనలు గానంచేస్తూ అనందించేవారు. అనిర్వచ నీయమైన ఆనందానుభూతి ననుభవించే వారు. గురువుగారు వీరి పాటలు విని పులకరించి పోయేవారు.

రోజూ ఇరువురూ కలసి తమ కార్యక్రమాలను నిర్వహించేవారు. స్నానసంధ్యలు, జపతపాలు చేసేవారు. ఈ జంటను చూసి మిగిలినవారు

అసూయ పడేవారు. ఉత్తముల విషయంలో అల్పులు మాత్సర్యం గలిగి వుండటం ప్రకృతి సహజం।

ఒకరోజు గురువుగారు పూజాదికములు పూర్తి అయిన తర్వాత భజనకార్యక్రమం ఏర్పాటు చేశారు. శిష్యులంతా పాల్గొన్నారు. దాసద్వయం మధురంగా కీర్తనలు పాడారు. తారతమ్య పద్ధతి ననుసరించి భజన జరిగింది. గురుప్రార్థనతో ప్రారంభమై శ్రీహరి వఱకూ సకల దేవతలను గురించి క్రమంగా పాటలు పాడుతూ భజనలు చేశారు. ఆనాటి సమావేశం ఒక సుందరస్వప్నం। సంగీత సాహిత్య సంభరిత మనోహరం। సుమధుర భక్తిభావనా తరంగం। పండిత పామర జనరంజకం। సమస్త దేవతలకు నిలయం, పుణ్యతీర్థాలకు ఆకరం.

ఎక్కడ హరికథా ప్రసంగం జరుగుతుందో అక్కడికి దేవతలంతా వచ్చి చేరుతారు. గంగాది సమస్త, పుణ్య తీర్థా లక్కడ నివసిస్తుంది.

"తత్రైవగంగా యమునాచవేణీ॥
గోదావరీ సింధు సరస్వతీ చ॥
సర్వాని తీర్థాని వసంతి తత్ర॥
యత్రాచ్యుతోదార కథాప్రసంగః॥

అని చెప్పబడింది. ఆనాటి భజన చక్కగా జరిగింది.

బాలలూ !

ఈనాటికీ అక్కడక్కడ భజన సాంప్రదాయాలు ఆచరిస్తున్నారు. పండుగ రోజులలో, తిరునాళ్ళలో, ఆలయాలవద్ద భజన బృందాలు నృత్యం చేస్తూ, పాటలు పాడటం మనం చూస్తుంటాము. కొందరు వారానికోసారి, నెలకోసారి తమ గృహాలలోగాని, ప్రత్యేకమైన భజన మందిరాలలో గాని,

ఆలయాలలోగాని చేరి భజనలు చేస్తుంటారు. డోలక్, తాళాలు, హార్మోనియం, తబల మున్నగు వాటిని ఉపయోగిస్తారు. దేవుడిపటం పెట్టుకొని భజన చేయడం జరుగుతుంది.

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధంగా ఈ కార్యక్రమం జరుగుతుంది. కొందరు ఒక బృందంగా చేరి నృత్యం చేస్తూ కీర్తనలు పాడుతారు. మరికొందరు కూచొని భజన చేస్తారు. ఎలా చేసినా భక్తితో చేయాలి. భజనలు చేసేటప్పుడు తప్పనిసరిగా పాటించాల్సిన ముఖ్య విషయాలు కొన్ని వున్నాయి.

భజన జరిగే సందర్భంలో అనవసర ప్రసంగాలు చేయటం కూడదు. లేచి అటూ ఇటూ తిరగరాదు. వెకిలి చేష్టలు, నవ్వుకోవటం చేయరాదు. చక్కగా పాడేవాడిని చూచి అసూయ చెందరాదు. కామ క్రోధాదులకు దూరంగా ఉండాలి. పేద ధనిక - జాతి మత భేదాలు పాటించరాదు. భజనలో పాల్గొనని వారిని తక్కువగా చూడరాదు. భజన చేసేవాళ్ళు తామేదో దేవతలమైనట్లు భావించరాదు. ఇతరులు కూడ భజన చేసే వారిని కించపరచకూడదు.

గురు ప్రార్థనతోగాని, విఘ్నేశ్వర ప్రార్థనతో గాని ప్రారంభించి, తారతమ్య పద్ధతి ప్రకారం భజన చేయాలి. మనస్సును భగవత్పరం చేయాలి. ఇలా సాంప్రదాయకమైన భజనలు ఎక్కడైతే జరుగుతుందో అచ్చట లక్ష్మీనారాయణులు, కొలువై యుంటారు. బృందారక శ్రేణి వారిని కొలుస్తూ వుంటుంది." అని వేంకటదాసులు చెప్పారు.

అప్పుడు ప్రసాద్ "నాకొక చిన్న సందేహమండి" అన్నాడు. ఏమిటన్నట్లు - చూశాడు దాసులు.

'గురువుగారైన వ్యాసరాయలు వేద వేదాంగాలను, శాస్త్రాలను, పురాణాలను క్షుణ్ణంగా తెలిసినవారు. ఎన్నో ఉద్గ్రంథాలు రచించారు. అలాంటివారు సాధారణ మానవులవలె కీర్తనలు రచించటం, భజనలు చేయటం చాలా ఆశ్చర్యంగా ఉందండి !" అని అన్నాడు.

"మంచి అనుమానమే." సహజంగా చాలా మందికి కలిగేదే. ఒక విధంగా ఆ మఠంలోని పండిత వర్గానికి కూడ ఈ విషయంలో అను మానం కలిగింది. మహా పండితులైన వారికి ఇలా భజనలు చేయటం బాధగా ఉండేది.

శాస్త్రజ్ఞానం ఎంత వున్నా అనుభవజ్ఞానం లేకపోతే ఫలితం లేదు. ఆచరణలో లేని తత్వజ్ఞానము మెట్ట వేదాంతము. సత్యమనునది పుస్తకాలలో లభించేది కాదు. ప్రతిక్షణం జీవితంలో వ్యక్తం కావాలి. కనుకనే వివేకా నందుడు 'ఒకటన్ను శాస్త్రజ్ఞానం కన్నా, ఒక ఔన్సు అనుభవజ్ఞానం గొప్పది' అన్నాడు. పంచాంగాన్ని పిండితే వర్షాలు పడవు. శాస్త్రాలకంతు లేదు. అంతా చదవాలంటే కాలము చాలదు. సారమైన విషయాలను మహాత్ములనుండి గ్రహించి అనుష్ఠించాలి.

స్త్రీ బాల వృద్ధులకు, పామరులకు భజన పాటలు సులభ గ్రాహ్య ములు. తద్వారా వారిలో భక్తి జ్ఞాన వైరాగ్యాలు పెంపొందగలదు. గొప్ప గొప్ప గ్రంథాలు చదివి అర్థం చేసికొనే శక్తి లేనివారికి, తత్సారభూతము లైన కీర్తనలు చక్కగా అర్థమై నిజమైన ఆనందానుభూతిని కలిగిస్తుంది. మోక్షసాధన సోపానంలో ఇదికూడ ఒక మెట్టు. భజనలు చేయటంవల్ల నష్టం లేదు. లాభం మాత్రం తప్పకుండా ఉంటుంది. మనకు తెలియని వేదాంత విషయాలలో, పెద్దలుచూపిన మార్గాన్ని అనుసరించటం శ్రేయ స్కరం.

"యద్యదా చరతి శ్రేష్ఠః తత్తదేవో తరోజనః" అని గీతావాక్యము. దేనినైతే పెద్దలు ఆచరిస్తారో, తక్కినవాళ్ళు దానిని అనుసరించాలి. వ్యాస రాయలు ఇలాంటివి ఆచరిస్తుండగా శిష్యులైనవారు వాటిని అనుసరించాలే గాని లేనిపోని అనుమానాలతో విపరీతార్థాలను చేయ బూనటం అవివేకమే అవుతుంది. అనాదిగా వస్తున్న సాంప్రదాయాలను, పద్ధతులను అను సరించాలి. ఇచ్చట సందేహాలకు తావులేదు.

వేదోపనిషత్తులు మహామహా పండితులకే సరిగా అర్థం కాదు. పూర్వ పుణ్య దివ్య జ్ఞానంగల ఏ కొందరి మహనీయులకో ఇందులోని భావాలు అవగతమవుతుంది. కనుకనే వీటిని సూర్య కిరణాలతో పోల్చారు. తత్సారభూతములు, సులభగ్రాహ్యములు అయిన కీర్తనలు పండిత పామర జనులకు స్త్రీ, బాల, వృద్ధులకు చక్కగా పనికివస్తాయి. దాసశ్రేష్ఠుల రచనలు చంద్రకిరణాలవలె ప్రకాశిస్తూ ఆహ్లాదాన్నిస్తుంది. సంగీత సాహిత్యాలతో అందర్నీ అలరిస్తుంది. ఈ అంశాన్ని గూర్చి శ్రీ పెషావర్ మఠాధిపతులు చక్కగా స్పష్టం చేశారు. ప్రముఖ వాగ్గేయకారులైన త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్య, పురందరదాసు, కనకదాసు, విజయదాసు మున్నగువారు తమ సంకీర్తనలతో లోకాన్ని ప్రబోధించారు. వీరి రచనలలో భక్తి జ్ఞాన వైరాగ్య భావాలు నిండుగా వున్నాయి. లలితకళలలోని సంగీతము, కవిత్వము వీరి పదాలలో ఉంది. గానమహిమ సర్వోత్కృష్టమైనది. శిశు ర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసం ఫణిః" అని ఆర్యోక్తి. పసిపాపలు గాని, పశువులుగాని, పాములు గాని గానరసానికి పరవశం చెందుతాయి. జోలపాట విని పసిబిడ్డ ఏడుపు మాని సుఖంగా నిద్రపోతుంది. బృందావనంలోని గో బృందములు శ్రీకృష్ణుని వేణుగానానికి తన్మయత్వం చెందినట్లు మనం విని యున్నాం. నాదస్వరం విన్న నాగుపాములు మైమరచి పడగవిప్పి ఆడటం చూశాం ఇలాంటి అనిర్వచనీయమైన ఆనందానుభూతిని కలిగించే శక్తి వాగ్గేయకారుల రచనలలో ఉంది.

భజనలు చేసేవారు గాని, గ్రంథాలు రచించే మహాపండితులు గాని నిజమైన భక్తి కలిగి ఉన్నప్పుడే భగవంతునికి ప్రీతిపాత్రులౌతారు. వాడి అనుగ్రహం ఉంటే ఎలాంటి పామరుడైనా పండితుడే! వాడి దయలేనివాడు ఎంతటి పండితుడైనా పామరుడే. కనుకనే జగన్నాథ దాసులవారు ఒక సందర్భంలో ఇలా అన్నారు

"పండితర పామర రెనిసి పురుషార్థ కొడుతిహను"

పండితులని గొప్పగా చెప్పుకొనే వారికి మద మాత్సర్యాలను ఇచ్చి అజ్ఞానాన్ని పెంచి పామరులుగా చేయగలడా భగవంతుడు. కనుకనే మహా పండితులు కొందరు శాస్త్ర వ్యాఖ్యానాలను, పురాణ ప్రసంగాలను చేస్తూ పట్టు శాలువలు కప్పుకొని సమస్తమూ తమకే తెలుసునని అహంకారముతో ఉంటారు. వీరి దృష్టికి తక్కిన వారంతా మూర్ఖులుగా, అల్పులుగా కనిపిస్తారు. కాని తమ అంతః శత్రువులైన అరిషడ్వర్గాలకు ఎంతగా తాము లొంగిపోయారో గ్రహించలేరు. పామరులు వేద శాస్త్రాలు చదవక పోయినా తమకు తెలిసిన భక్తి భావంతో భగవంతుని కొలుస్తారు. మద మత్సరాలు లేని నిజమైన భక్తి వీరిని తరింప జేస్తుంది. ఇది జగన్నాటక సూత్రధారి ఆడించే నాటకం. సాధారణ మానవుల ఊహకు కూడ అందని విచిత్రం.

"శబరి యెంగిలిచ్చినా చంద్రదరుడు మెచ్చినా" కుచేలుడు భక్తితో ఇచ్చిన పట్టెడు అటుకులు, విదురుడిచ్చిన విందు, తిన్నడి మూఢభక్తి భగవంతునికి ప్రీతి కలిగించాయి.

శ్రీపాద రాయలచే చంద్రికాచార్యులని బిరుదు పొంది 'న్యాయ సుధ'- 'చంద్రిక'- 'తర్కతాండ'వాది ఉద్గ్రంథాలను రచించిన వ్యాస రాయలు పామరుల కోసం ప్రాకృత భాషలో పద పద్య సుళాదులను, ఉగాభోగాలను కూడ రచించారు. తన్మయత్వంతో గానం చేశారు. భాము

భజనలు చేస్తూ ఇతరులచేత చేయిస్తూ ఆనందించారు. ఇచ్చట "పండితుడు-పామరుడు" అన్న భేదాలకు తావులేదు. వేదాంత పథంలో భజనలు చేయటం కూడా ఒక మైలు రాయి. గురువుగారు చూపిన మార్గంలో నిజమైన శిష్యులు పయనిస్తారు. సత్ఫలితాలను పొందుతారు. గురువుగారి కున్న జ్ఞానం స్వల్పమని శిష్యులు భావిస్తే, అంతకన్నా బుద్ధిలేనితనం మరొకటి లేదు. కనుక గురువుగారు చెప్పినట్లు నడుచుకుందాం.

శ్రీ వీరబ్రహ్మంగారి శిష్యుడు సిద్ధయ్య గురువుగారి మాటను వేద వాక్కుగా భావించి అల్పపదార్థాన్ని భక్షించాడు. అది అతడికి అమృత మధుర పదార్థమైంది.

వ్యాసరాయలు శిష్యులకు వేదశాస్త్ర పురాణాలను బోధిస్తూ, కీర్తనలు, భజనలు కూడా 'ముక్తి' దాయకములని వివరించారు.

బాబూ! ఇప్పుడర్థమయిందా! వ్యాసరాయలు భజనలు చేయటంలోని అంతరార్థం! ఆనాటి భజన కార్యక్రమం అయిన తర్వాత గురువుగారు కనక దాసును, పురందరదాసును మెచ్చుకున్నారు. ఇది చూచి పండితులంతా నొచ్చుకున్నారు.

మరుసటిరోజు అందరూ కలసి కనకదాసును పిలచి "ఏమయ్యా! కనకదాసూ! నువ్వు కురబవాడివి కదా! గతంలో మద్య మాంసాలను రుచి చూచి వుంటావు. ఎన్నో నీచపు పనులు చేసి వుంటావు. అలాంటి నీవు మా మధ్యన వచ్చి గొప్ప దాసుని వలె నటిస్తున్నావు. మహాత్ములైన గురువుగారిపై ఎలాంటి మత్తు మందు చల్లావోగాని వారు నీకు లొంగి పోయారు. ఏమి నీ దాసత్వము? మా గురువుగారే నీకు దాసులై పోయారు. మేమంతా వేద శాస్త్రాలు అభ్యసించిన బ్రాహ్మణులం. మా మతం చాలా గొప్పది. నీ వూహకు గూడ అందని పవిత్రమైన మార్గంలో మేము పయనిస్తున్నాం. జాతి రత్నాలకు గాజు పెంకులకు వ్యత్యాసం లేదా?

ఇకనైనా నీవు మా నుంచి దూరంగా వెళ్ళిపో" అని మందలించారు. ఈ విధంగానైనా కనకుని పీడ విరగడౌతుందని వారి ఉద్దేశ్యం. వారి మాటలకు చిరునవ్వుతో కనకుడు ఇలా అన్నాడు.

"ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులారా ! మీరన్నది నిజం. నేను గొల్లవాడిని. పాళెగాడుగా అధికారం చెలాయించాను. ఎన్నో పాపకృత్యాలు చేశాను. కాని భగవదనుగ్రహంతో మీ బోటి ఉత్తముల చెంతకు చేరాను. నేను మునుపటి కనకుడ్ని కాను నాలో ఎంతో మార్పు వచ్చింది. సజ్జనులైన మీతో చేరి నన్ను నేను సంస్కరించుకోవాలని వచ్చాను. మీ బోటి వారికి బదులు చెప్పేంత చదువులు నేను చదువలేదు. ఇకపోతే కులప్రసక్తి వచ్చింది గనుక నాకు తెలిసింది చెబుతాను.

"చరా చర సృష్టికి మూల కారకుడైన ఆ భగవంతుడికి ఒక కులం అంటూ ఉందా ? విశ్వ వ్యాపకుడు, సర్వతోముఖుడు, సర్వాంతర్యామి యైన ఆ పరమాత్మకు ఇటువంటి పట్టింపులు లేవుగదా ! పంచభూతాలు కులమతాలకు తగినట్లుగా వాటి కృత్యాలను ఆచరిస్తున్నాయా ? అవి వాటి ధర్మాలను సర్వజీవుల విషయంలో సమంగా నిర్వహిస్తున్నాయి గదా !" అని చెప్పి ఇలా పాట పాడాడు.

కుల కుల కుల వెన్నుతి హరు ॥ప॥
కుల వ్యావుడు సత్య సుఖ వుళ్ళ ఆనరిగె ॥అ॥

కెసరొళు తామర పుట్టలు అదతందు ।
బిసజనాభని గర్భిస లిల్లవె ॥

హసువిన మాంసదొళుత్పత్తి క్షీరవు ।
వసుధె యొళగె భూసుర వుణ్ణ లిల్లవె ॥

మృగ గళ మై యల్లి పుట్టిద కస్తూరి ।
తెగెదు పూసువరు భూసుర రెల్లరు ॥

బగెయింద నారాయణ న్యావ కులదవ ।
అగజ వల్లభ న్యాతెర కులదవను ॥౨॥

ఆత్మ యావకుల జీవ యావకుల ।
తత్త్వేంద్రియ గళ కులపేళిరయ్యా ॥

ఆత్మాంతరాత్మ నెలెయాది కేశవ ।
అతనొలిదమేలె యాతర కులవయ్యా ॥౩॥

ఇలా పాట పాడుతున్నపుడు పురందరదాసు వచ్చి జరిగిన విష యాలను అవగతం చేసికొన్నాడు. పాట పూర్తియైన పిమ్మట "మీ పాట లోని భావం వీరికి అర్థమయ్యే ఉంటుంది. వారడిగిన దానికిది చక్కటి సమాధానం. ఇక వారిని పట్టించుకోకండి. వాదనలు పెంచుకోవద్దు. తాము గొప్పవాళ్ళమని విర్రవీగే వారితో మనం గ్రుడ్డి, చెవిటి, మూగ వారివలె మెలగాలి.

"అంధ బధిర సుమూక నంతిరు
మందజనరొడనె"

అన్నట్లు వర్తించాలి కాదని మాటలు పెంచుకుంటే మనోవ్యధే మిగులుతుంది." అని పురందరదాసు అతనిని అనునయించాడు.

"బాలలూ ! అగ్రవర్ణస్తులు ఇతరులను తక్కువగా చూడకూడదు. ఒక మతస్థులు మరొక మతస్థులను కించపరచకూడదు. మనది ప్రజాస్వామ్య రాజ్యము. అన్ని జాతులకు మతాలకు సమాన ప్రాతినిధ్యం వుంది. మత భేదాలతో, వర్గ భేదాలతో పరస్పరం కలహించుకోరాదు. మనమంతా మానవులం. కర్మభూమిలో ఒకటే మతం. మనమంతా

హిందువులం. హిందువులుగా పుట్టిన మనం హైందవ ధర్మాలను ఆచరించాలి. మన తిరుమల తిరుపతి దేవస్థానం గూడ హిందూ ధర్మ రక్షణార్ధం అనేక పనులు చేపట్టింది."

"అసలు ఈ మతాలనూ కులాలను ఎవరు కనుక్కున్నారు ?" అని ప్రశ్నించాడు కిరణ్. దానికి దాసుల వారు,

"చాతుర్వర్ణ్యం మాయా సృష్టం
గుణకర్మ విభాగశః"

—అని గీతలో శ్రీకృష్ణ పరమాత్మ చెప్పి యున్నాడు. మానవుల గుణ స్వభావములను బట్టి నాలుగు వర్ణములను నేనే సృష్టించితిని. అవి,

"బ్రాహ్మణ క్షత్రియ విశాం
శూద్రాణాం చ పరం తపః
కర్మాణి ప్రవిభక్తాని
స్వభావ ప్రభవై ర్గుణైః"

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని నాల్గు విధములుగా వర్ణములు గలవని శ్లోకార్ధము. వీరు వారి వారి నైసర్గిక స్వభావముల చేతను, సత్వాది గుణముల చేతను విభిన్నములైన కర్మలను ఆచరించుచుందురు.

బ్రాహ్మణులు-శాంతము, ఇంద్రియ నిగ్రహము, తపస్సు, ఓరిమి, ఋజుత్వము, విజ్ఞానము, వేదములందు, దేవుని యందు విశ్వాసము మున్నగు గుణములు — సత్కర్మలు కలిగియుందురు. ఇవి ముక్తి యోగ్యములు.

ఇలాంటి వారిని రాజులు ప్రజలు గౌరవిస్తూ పూజించేవారు. ఇలాంటి గుణములతో ఒప్పిన బ్రాహ్మణులను నమస్కరిద్దాం. కర్మ దూరులైన వారు బ్రాహ్మణులైనా అధములతో సమానము.

"జందె మింపుగ వేసి సంధ్య వార్చిన నేమి
బ్రహ్మ మందక కాడు బ్రాహ్మణుండు."

అని నృసింహ శతక కారుడు స్పష్టంగా చెప్పియున్నాడు. బ్రహ్మజ్ఞానం కలవాడే బ్రాహ్మణుడు.

క్షత్రియులు : శౌర్యము, ధైర్యము, దక్షత, రాజరికము, శీలము, ధర్మరక్షణ, నియమము, గురుభక్తి, బ్రాహ్మణ భక్తి మున్నగు గుణములలో వొప్పి యుందురు. ఇవి లేనివారు క్షత్రియులు కారు. పూర్వం యజ్ఞ రక్షణ, దుష్ట శిక్షణ, దాన ధర్మాది కృత్యములు చేసినవారు, భుజ బల పరాక్రమము గలవారు యశోవంతులై రాజించారు.

వైశ్యులు : వాణిజ్యము, దేవ గురుద్విజుల యందు భక్తి, పశు పోషణ, దాన ధర్మములు, వ్రతములు ఆచరించుట మున్నగు సత్కార్మలు కలిగి యుందురు. ఇలాంటి వైశ్యులు మంచి కీర్తి ప్రతిష్ఠల నార్జింతురు.

శూద్రులు : కపటము లేకుండుట, దేవ బ్రాహ్మణ భక్తి, వినయ విధేయతలు, కృషి గో రక్షణాది కార్యములు చేస్తూ సేవారూపమగు కర్మలు కలిగి యుందురు. పురుష సూక్తంలో గూడ ఈ వర్ణములను గూర్చి వివరింపబడినది.

బ్రాహ్మణోఽశ్య ముఖమాసీత్ ।
బాహూరాజన్యకృతః
ఊరూతదశ్య వైశ్యః
పద్భ్యాం శూద్రో అజాయత ॥

వర్ణముల ననుసరించి వర్ణ ధర్మముల నాచరించటం శ్రేయస్కరం. వర్ణ సంక్రమం జరుగకుండా చూడవలసిన పని ప్రభువులది. అప్పుడే

వారిని ధర్మపాలకులని పిలుస్తారు. దేశం సస్యశ్యామలమై సుభిక్షంగా ఉంటుంది. వర్ణ సంక్రమం వలన విపరీతములైన అనర్థాలెన్నో జరుగుతాయి. పితృలోకంలోని వారికి తిలోదకాలు పిండ ప్రదానాలు సక్రమంగా చేరాలంటే వర్ణ సంక్రమాలు జరుగకూడదు. కనుక కులధర్మాలకు ఎవరూ విడనాడరాదు.

కులంనశిస్తే కులధర్మాలు నశిస్తాయి. ధర్మంనశిస్తే అధర్మం ప్రబలుతుంది. తద్వారా ధర్మహాని కులస్త్రీల నాశనము జరుగుతుంది. కనుక ఎవరి ధర్మాలు వారు ఆచరించాలి. పరధర్మం ఆచరించటం అవివేకం, అనర్థదాయకం.

"స్వ ధర్మం నిధనం శ్రేయః
పరధర్మో భయావహః"

జరిగిన సంఘటనలు గురువుగారు గ్రహించారు. సమయం వచ్చినపుడు పండితులకు తగిన గుణపాఠం నేర్పాలని అనుకున్నారు. సత్యం ఎప్పుడెలా నిరూపింపబడుతుందో అప్పుడే అసత్యవాదుల కళ్ళు తెరువబడుతుంది. అవసరం వచ్చినపుడే కనకదాసుల గొప్పతనం తప్పక గుర్తింపబడుతుంది.

"సత్పురుష చిత్తము నొచ్చిన రక్తవోవునే —" మంచివారి మనస్సుకు బాధ కలిగితే అది వృథా కాదు.

మఠంలోని పండితులు అప్పుడప్పుడు కనకదాసును "ఏదో ఒక నెపంతో సాధిస్తూనే ఉన్నారు. అతడిపై విరోధ భావంతోనే ఉన్నారు.

"స్నేహంగా నున్నప్పుడు ఒకరి తప్పులను మరియొకరు గుర్తించరు. ఆ స్నేహం భగ్నమైందా

"కూరిమి గల దినములలో
నేరము లెన్నటికిని గలుగ నేరవు మరి యా
కూరిమి విరసంబయినను
నేరములే తోచుచుండు నిజముగ సుమతీ !

అన్న నీతి పద్యంలోని ప్రతి యక్షరం సత్యము.

లోకంలో సజ్జనులు దుర్జనులు అని రెండు రకాలవా రుంటారు. దుర్మార్గులు వైరాన్ని కోరుకుంటారు. సజ్జనులు స్నేహాన్నే వాంఛిస్తారు.

"నీచాః కలహ మిచ్ఛంతి
సన్ధి మిచ్ఛంతి సాధవః-"

అను ఆర్యోక్తి సత్య సమ్మతమైనది. సజ్జనులు తమ కార్యాలను సైతం వదలుకొని పరుల కుపకారం చేస్తుంటారు. మధ్యములు తమ పనులతో బాటు ఇతరులకు సాయం చేస్తుంటారు. నీచులు కేవలం స్వార్థంతో తమ పనులు మాత్రం చేసికొంటూ ఇతరుల కార్యాలను వమ్ము చేస్తుంటారు. వీరందరికన్నా విలక్షణమైన మనః ప్రవృత్తి గలవారు అనవసరంగా ఇతరుల కార్యాలలో జోక్యం చేసికొని వాటిని భగ్నం చేస్తారు. ఇలాంటి వారిని ఏమని పిలవాలో అర్థం కాదని సుభాషితం చెబుతుంది.

"తమ కార్యంబు పరిత్యజించియు పరార్థ ప్రాపకుల్ సజ్జనుల్
తమ కార్యంబు ఘటించుచున్ పరహితార్థ వ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థ ఘాతుక జనుల్ దైత్యుల్ వృథాన్యార్థభం
గము గావించెదు వార లెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్.'"

ఈ విధంగా మానవులలో ఉత్తమ మధ్యమ అధములని వారి వారి గుణములను బట్టి తారతమ్యాలు యేర్పడింది. వేంకటదాసు సందర్భాను

సారంగా నీతి పద్యాలను ధర్మ సూక్ష్మాలను ఉదాహరణలతో వివరిస్తూ కథను చెప్పుకపోతున్నారు. విన్నవారి హృదయాలలో చక్కగా నాటుకు పోయేలా కథలు చెప్పటం కూడా ఒక కళే ఏవో సినిమా కథలు రాజకీయాలు అనవసర ప్రసంగాలవల్ల కాలం వ్యర్థమవుతుంది. వేదాంత కథలు ఇహపర సౌఖ్యములు, శాశ్వతానందదాయకములు.

"దాసులవారూ ! ఈ పద్య మెక్కడో చదివినట్లుగా ఉందండి." అన్నాడు వంశీ. ఎక్కడో ఏమిటి ? మన తిరుమల దేవస్థానంవారు సుభాషితములు అనే పుస్తకాన్ని ముద్రించారు. అందులోదే యీ పద్యం. నీవు హిందూ ధర్మ సంస్థ నిర్వహించిన పురాణ ప్రబోధ పరీక్షలను వ్రాసావా ? మా తెలుగు మాస్టారు ఈ పద్యానికి అర్థ తాత్పర్యాలు చక్కగా చెప్పారు.

అవునండి. కేవలం మూడు రూపాయలకు రెండు పుస్తకా లిచ్చారు. 8, 9, 10 తరగతుల విద్యార్థులు ఈ పరీక్షలు వ్రాయవచ్చు. ఇందులో హనుమంతుడు, భగీరథుడు, శ్రీనివాసకల్యాణం మున్నగు కథలు, హైందవ ధర్మాలు, సుభాషిత పద్యాలు, ఇతర శ్లోకాలు ఉన్నాయి.

'మహమ్మదీయులు, క్రైస్తవులు, హిందువులు అనే వ్యత్యాసము లేకుండా ప్రతి యొక్కరు ఈ పరీక్షలు వ్రాయవచ్చు.' అన్నాడు పూర్ణచంద్ర.

'చాలా సంతోషము. తక్కువ ధరలతో చక్కటి ముద్రణలతో తిరుమల తిరుపతి దేవస్థానమువారు ప్రతి పాఠశాలకు ఈ పుస్తకాలను సరఫరా చేస్తుంది బాలలైన మీ యందు హిందూ ధర్మ బీజాలను నాటుతోంది. విద్యార్థులంతా ఇలాంటి పరీక్షలలో పాల్గొనాలి. దిగజారిపోతున్న మన ధర్మాలను నిలబెట్టాలి. ఈ దేవస్థానమువారు ఎన్నో పద్ధతుల ద్వారా హైందవ ధర్మ రక్షణకు పూనుకొన్నారు.'

"నీవు హిందువుగా జన్మించినందుకు సంతోషించు. నుదుట బొట్టు బెట్టుకో, పెద్దలను గౌరవించు. భగవద్గీతలోని శ్లోకాలను చదువు." అంటూ కొన్ని సూత్రాలను ఆచరించ మంటూంది. కూలిపోతున్న మన హైందవ ధర్మాలను రక్షిస్తుంది. కనుకనే తిరుమల తిరుపతి దేవస్థానం ప్రపంచ దేశాలలో విశిష్టతను పొందియున్నది మన ఆంధ్రులు చేసుకొన్న పుణ్యఫలమో అన్నట్లు ఈ దివ్యక్షేత్రం ఆంధ్రరాష్ట్రములో ఉంది. వేంకటాచలానికి మించిన పవిత్ర క్షేత్రం మరొకటి యీ విశ్వంలో లేదు. శ్రీనివాసునికి సమమైన దైవంలేదు.

'వేంకటాద్రి సమం స్థానే
బ్రహ్మాండే నాస్తి కించన
వేంకటేశ నమో దేవో
నభూతో నభవిష్యతి'

అని బ్రహ్మాండ పురాణంలో చెప్పబడింది.

ఇక మనం అసలు కథలోకి వద్దాం. 'ఇలా పండిత లోకమంతా కనకుడి విషయంలో వ్యతిరేక భావంతో ఉంది. గురువుగారు మాత్రం కనకుని గొప్పతనం నిరూపించేందుకు తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నారు. ఆ రోజు రానే వచ్చింది. సభతీర్చియున్న సందర్భంలో గురువుగారు చతుర్విధ పురుషార్థాలను వివరిస్తున్నారు.' మానవజన్మ సార్థకం చేసికొనేందుకు ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలను సాధించాలి. ధర్మార్థ కామములు ఇహలోకానికి సంబంధించినవి సత్యమైన జగత్తు ధర్మముచేత ధరింపబడునది. కనుక ధర్మరక్షణ చేయటం మానవుల కర్తవ్యం. అధర్మం వ్యాపించి ధర్మహాని జరిగినప్పుడు భగవంతుడు అవతరిస్తాడు.

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" – అని గీత. శ్రీహరి గురువులను సేవించటం, పెద్దలను గౌరవించటం, సత్యము, పరోప

కారము, క్షమ, అహింస, సమత మున్నగువాటిని పాటించటం ధర్మరక్షణ మౌతుంది. ఏ తద్విరుద్ధ కార్యములు అధర్మాశ్రయములు ధర్మాన్ని మనం రక్షిస్తే అది మనంను రక్షిస్తుంది. "ధర్మోరక్షతి రక్షితః" అని చెప్పబడింది. ధర్మరాజు రాజ్యము, సంపద, సోదరులు, బంధువుల, సమస్తమూ నశించినా నాకు చింతలేదు. ధర్మాన్ని మాత్రం నేను వదలను. అని అన్నాడు. కురుక్షేత్ర సంగ్రామంలోను శ్రీకృష్ణ పరమాత్మ "అర్జునా! నీ ధర్మాన్ని నీవు ఆచరించు." అని ఆదేశించాడు. కనుక ధర్మమే గొప్పది. ధర్మబద్ధమైన పద్ధతిలో అర్థాన్ని ఆర్జించాలి. ఆర్జించిన ధనాన్ని సద్వినియోగము చేయాలి. పుణ్యకార్యాలకు వినియోగించాలి. అధర్మంగా ధనాన్ని సంపాదించడం పాపకృత్యమే అవుతుంది. కామ మనగా కోరిక. ధర్మ విరోధముగాని కామం మంచిది. క్షణికములైన ఐహిక సుఖాలను పరిమితం చేసికోవాలి. కోరికలను అదుపులో నుంచుకున్నవాడు ఇంద్రియాలను స్వాధీన పరచుకోగలడు. కోరికలను ప్రపంచోన్ముఖ మొనర్చునపుడవి శత్రువులగును. వానినే భగవత్పరములు చేసిన మిత్రులగును. కామ క్రోధాదులను భగవత్సేవకు వినియోగించటం మంచిది. భగవంతుని చూచుటలో కామము, అతనిని విడచియుండ లేమనే లోభము, అతని చరణారవిందములపై మోహము, అతని స్మరణలో మదము, భగవద్వేషులపైన కోపము, అతనిని కొనియాడువారి సాంగత్యము మనకుండాలి.

పవిత్ర మార్గంలో ధర్మార్థకామాలను అనుభవించువారికి మోక్షము కరతలామలక మవుతుంది. మోక్షమే జీవితాశయము, శాశ్వతము, ఆనంద దాయకము. "ఇప్పుడు నేను పేకొక ప్రశ్న వేస్తాను." అని అందర్నీ చూచి మోక్షార్హు లెవ్వరు ? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పండి.

హఠాత్తుగా గురువుగారు వేసిన ప్రశ్నకు పండితులందరూ ఆశ్చర్య పడ్డారు. తమలో తాము తర్జన భర్జనలు చేసికొన్నారు మోక్షానికి అర్హులు

వేదాలను వల్లెవేసినవారని, యజ్ఞయాగాదులు, జపతపాలు చేసిన వారని ఇలా రక రకాలుగా ఊహించుకొంటున్నారు.

"దాసులవారూ! కామ క్రోధాదులను జయించిన వారే మోక్షార్హులు కదండీ" అన్నాడు కిరణ్.

"కాదు కాదు. గంగలో స్నానం చేసినవారు. అలా స్నానం చేసిన వారి పాపాలు పటాపంచలౌతాయి. పాపాలు నశించినవారు పుణ్యాత్ములు. వీరే మోక్షార్హులు. అంతేగాక గంగ విష్ణుపాదాలనుంచి పుట్టింది" అన్నాడి ఖాను.

"భాగవతాది పురాణాలు, భగవద్గీత చదివే వారే మోక్షానికి వెళ్తారు. చక్కగా వేదాంతోపన్యాసాలు చేసేవారు, భజనలు చేసేవారు, తిలకము బొట్టు పెట్టుకున్న సజ్జనులే మోక్షాన్ని పొందగలుగుతారు" అన్నాడు పూర్ణచంద్ర.

"ఇవన్నీ కావు. దాన ధర్మాలు, పరోపకారం, శాంతము, సత్యము, అహింస, వ్రతాలు జపాలు చేసేవారికే మోక్షం లభిస్తుంది." అన్నాడు వంశీ.

"హరిదాసులకే మోక్షం లభిస్తుంది. నేను దాసుణ్ని అయిపోతాను. దాస వేషం వేస్తాను. వంచన చేయను. ఆత్మవంచన అసలే చేసికోను. మిత్ర ద్రోహం కూడా చేయను. దాసపీఠానికి యేలికనై మహాత్ములకు సేవకుడనై దాసశ్రేష్ఠుడనై దాస సాహిత్యానికి, దాసపథానికి న్యాయం చేకూరుస్తాను. భక్తితో భజనలు చేస్తాను. మోక్షాన్ని సాధిస్తాను. శాశ్వత కీర్తిని ఆర్జిస్తాను. కనుక నేనే మోక్షార్హుణ్ని" అన్నాడు గురురాజా.

మోక్షం బజారులో దొరికే వస్తువుకాదు. పోని ముందుగా "రిజర్వేషన్" చేసికొందామంటే "ట్రైన్ టికెట్టు" గాదు అలా చేసికొన్నా సకాలంలో చేరుతామని గ్యారంటీలేదు. మోక్షానికి ఫలానా వారు అర్హులని

ఫలానావారు అనర్హులని నిర్ధారణ చేసి చెప్పేందుకు గ్రంథాల్లోని విషయా లను ఉదహరించవచ్చు. కాని "యీ జీవి ముముక్షువని జీవన్ముక్తుడని ఆ భగ వంతుకు తప్ప యింకెవ్వరూ చెప్పలేదు" అన్నాడు ప్రసాద్.

"మనమంతా నిమిత్త మాత్రులం. కర్మ బద్ధులం. భగవంతుని నిర్ణ యానుసారం జరిగేది మోక్షప్రాప్తి. ఒకవేళ భక్తి జ్ఞాన వైరాగ్యాలుగల సజ్జ నులే మోక్షార్హులేమో." అన్నారు కృష్ణ.

బాలలంతా ఈ విషయాన్ని గూర్చి తమకు తోచిన వ్యాఖ్యానాలు చేస్తుంటే వేంకటదాసు ఆనందానుభూతితో పరవశించిపోయారు. అక్కడ ఉన్న వారంతా బాలవాక్కులు బ్రహ్మవాక్కులని తలంచారు. కపటము లేకుండా పలికే పలుకుల్లో సత్యము దాగుందన్నారు కొందరు. అన్నీ తెలుసనే అహంకారముతో మసలే పండితులకన్నా జ్ఞాన వృద్ధులైన బాలురే గొప్పవారు. కనుకనే "పరిపక్వదశకు చెందిన 'జ్ఞాని' పసిబిడ్డతో సమాన మని" మహనీయు లన్నారు.

"చాలు చాలు! మీరంతా అప్పుడే పెద్ద పెద్ద విషయాలను గురించి చర్చిస్తున్నారు. మీరు వ్యక్తం చేసిన అభిప్రాయాలు బాగానే ఉన్నాయి. మరి ఆదినం ఏమి జరిగిందో చెప్తాను వినండి." మఠంలో చర్చ జోరుగా జరుగుతుంది. పండితులంతా జన్మ పరంపరలను గురించి వర్ణాశ్రమ ధర్మా లను గురించి ముచ్చటించు కొన్నారు. చివరకు బ్రాహ్మణులే సత్వ గుణము గలవారని వారే మోక్షార్హులని గురువుగారితో అన్నారు. దాసద్వయం కిమ్మనకుండా వున్నది. వ్యాసరాయలు పండితాభిప్రాయం విని మళ్ళీ ఇలా ప్రశ్నించారు.

"ఇక్కడున్న వారిలో ఎవరు మోక్షానికి వెళ్తారు?" ఇది విన్న పండిత వర్గం మరింత ఆశ్చర్యానికి లోనైంది. మొదటి ప్రశ్నకన్న ఈ ప్రశ్న క్లిష్టంగా ఉండి అందర్నీ కలవర పెట్టింది. అందరూ భారత

భాగవతాది గ్రంథాల్లోని ప్రమాణాలను చెప్పారు. కొందరికి మాత్రం తమకు తామే మహాత్ములమనే జ్ఞానం కలిగింది. ఇంతకాలం తాము చేసిన జప తపాలు, దైవకార్యాలు, గురు పూజలు లెక్కించుకొని, తామే నిజమైన మోక్షార్హులని ఊహించుకొని పొంగి పోయారు. చుట్టూ ఉన్న వారిని లక్ష్య పెట్టక పరిసరాలను మరచిపోయి మోక్ష సామ్రాజ్యంతో విహరిస్తున్నట్లు తల పోసి పులకరించి పోయారు ఇతరులకన్నా తామే అధికుల మన్నట్లు గర్వ పడసాగారు. తమలో తాము "నేనంటే-నేను మోక్షార్హుణ్ణి" అని సమాధాన పడ్డారు.కాని గురువుగారి ముందు తమ ఉద్దేశాలను వెల్లడించ లేక పోయారు. కొందరు ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేక మౌనంగా ఉండిపోయారు.

అప్పుడు గురువుగారు ఒక్కొక్కరిని ప్రత్యేకించి చూస్తూ 'నీవు మోక్షానికి వెళ్ళగలవా?' అంటూ వరుసగా ప్రశ్నిస్తూ వచ్చారు. అందరు బిక్క ముఖాలతో "లేదండీ లేదు" అంటూ జవాబిచ్చారు. తరువాత పురం దరదాసు వంతు వచ్చింది. అతడు "శ్రీహరీ" అంటూ కళ్ళుమూసుకొని దైవ ధ్యానం చేయసాగాడు. అతని ప్రక్కన ఉన్న కనకదాసును చూచి "కనకా! నీవు వెళ్ళగలవా?" అని ప్రశ్నించారు.

పండితులంతా ఫక ఫకా నవ్వారు. "బ్రాహ్మణోత్తములైన మాకు బోధపడని విషయం హీనకులంలో జన్మించినవాడు, పామరుడు, అల్పుడు అయిన వీడికేమి తెలుసు?" అంటూ అవహేళన చేశారు.

గురువుగారు "కనకా! త్వరగా సమాధానం చెప్పు. నీవు మోక్షానికి పోతావా?" అని రెండు మూడు సార్లు కనకద్నే గుచ్చి గుచ్చి ప్రశ్నించి నారు. అందరూ గురువు గారిని అయోమయంగా చూడసాగారు. ప్రత్యే కించి కనకుడ్నే పలుమార్లు ప్రశ్నించటంలో 'గురువుగారి భావం ఏమిటా!' అని ఆలోచించసాగారు. కనకదాసు గొప్పతనాన్ని బహిర్గతం చేయాల్సిన

సమయం ఇపుడు వచ్చింది. ఇంత కాలం అతడ్ని అపార్థం చేసికున్న వారికీ కనువిప్పు కలగాలని భాగవతోత్తముల యొక్క గొప్పతనాన్ని పండితులు గుర్తించాలనీ గురువుగారు సంకల్పించుకున్నారు సత్య నిరూపణకు సమయం ఆసన్నమైంది.

"కనకా! త్వరగా జవాబు చెప్పు. ఈ పండితుడు మోక్షానికి వెళ్ళు తాడా?" అని ఒక పండితుని వైపు చూపాడు. వెంటనే కనకదాసు "ఊహు! వెళ్ళడు" అని చెప్పాడు. గురువుగారు మఠములోని వారినందరిని వరుస బెట్టి చూపుతూ అదే విధంగా ప్రశ్నించాడు. కనకుడు లేదని సమాధానం చెపుతూ వచ్చాడు.

"పోనీ కనకా! ఇలా నావైపు చూడు. నేను మోక్షానికి వెళతానా?" అని ప్రశ్నించాడు. కనకుడు తలను అడ్డంగా తిప్పుతూ "మీరు కూడా వెళ్ళరు" అంటూ జవాబిచ్చాడు.

ఈ సమాధానంతో పండితులంతా నిశ్చేష్టులయ్యారు. "ఏమిటి ? ఇతని తలబిరుసు తనం! మనమందరం మోక్షార్హులం కామని చెప్పినా చెప్ప వచ్చు. సాక్షాత్తు గురువు గారిని కూడ అనర్హులనడం వింతగా ఉంది. ఇది గురు ధిక్కారమే." అంటూ ఇంతకాలం తమలో దాగియున్న యీర్ష్యాగ్ని జ్వాలలను వెడల్రగక్కారు. "ఇదే చక్కటి తరుణం! ఈ కనకుడి పీడను వదలించు కొందాము" అనుకొన్నారు.

"గురుదేవా! ఈ కనకుడు మిమ్మల్ని 'గూడ లక్ష్య పెట్టలేదు. మా విషయంలో ఎలాగైనా ఫర్వాలేదు. మీకు అవమానం జరిగితే మేము సహించ లేము. ఈ ప్రపంచంలో మీరుగాక ముక్తి యోగ్యులు యింకెవ్వరున్నారు? కనకుడి వంటి అల్పులకు ఆశ్రయమిస్తే ఇలాగే జరుగుతుంది. ఈ కురబ వాడి కెంత పొగరు? జాతి నీతి లేని యిలాంటి వారిని దరిచేర్చితే పెద్దల విలువ పోతుంది. అల్పబుద్ధులకు అధికారమిస్తే దొడ్డవారిని లెక్కబెట్టరు.

ఇలాంటి వాడికి మన మఠంలో స్థానంలేదు. వీడిని వెంటనే బహిష్కరించండి. వీడికి శాస్త్రపాఠాలు, వేదాంత బోధనలు కావలెనా? పాములకు పాలు పోసి పెంచితే ఫలమేమి? నీచులు తమ నీచ గుణాలను ఎన్నటికి విడనాడరు." అంటూ పండితులంతా కనకుణ్ణి ఆక్షేపించటంలో తమ పాండిత్యాన్ని, వాదకుశలాన్ని ప్రదర్శించారు.

గురువు గారు వారి నందరిని శాంత పరచారు. కనకుడి వైపు చూచి "కనకా! నీవు మోక్షానికి వెళ్ళుతావా?" అని ప్రశ్నించారు. ఈ ప్రశ్న కోసమే ఎదురు చూస్తున్న అతడు ముందు వెనుకలు ఆలోచించక "నేను పోతే పోతాను!" అని వెంటనే సమాధానమిచ్చాడు. ఈ సమాధానంతో పండితులంతా విస్తుపోయారు. "ఔరా! 'వినాశకాలే విపరీత బుద్ధిః' అన్నట్లు ఈ అల్పజాతివాడు మోక్షానికి అర్హుడట. మహాజ్ఞానులు, తపోధనులు నిగ్రహానుగ్రహ దక్షులైన గురువుగారు మోక్షార్హులు కారా?" అంటూ కనకుడ్ని చూచి అందరు నిప్పులు గ్రక్కారు. "ఓరీ కనకా! ఏమిటి నీ అసందర్భ ప్రలాపము. నీవు మోక్షానికి వెళ్ళుతావా? చూడు. నిన్నేమి చేస్తామో!" అంటూ లేచారు. అప్పుడు గురువుగారు "నాయనా! కనకా! నీ భావాన్ని కాస్త వివరంగా తెలియ చేయమన్నారు. అప్పుడు కనకదాసు- "స్వామీ! మిమ్ములను గాని పండితులను గాని అవమానించే పని నేను చేయలేదు. త్రికాలా బాధితమైన సత్యాన్నే పలికాను. వీరంతా నామాటను అపార్థం చేసికొన్నారు."

ఏమిటి? నీ మాటలు మాకర్థం కాలేదా! నీవు పల్కింది వేద విహితమైనదా? లేక శాస్త్రార్థమా? దీనికి విశేషార్థాలు, వ్యాఖ్యానాలు చేయాలా? అంటూ పండితులు అవహేళన చేశారు.

దానికి కనకదాసు పండితులారా! మీరంతా వేద శాస్త్రాలు చదివిన పండితోత్తములు. నేనా పామరుడ్ని. నేను ఉపయోగించింది కేవలం ఒక

చిన్న ప్రాకృత పదమే. దీన్ని అర్థం చేసికోవడానికి వ్యాకరణాది గ్రంథాలు గాని, శాస్త్ర వ్యాఖ్యానాలు గాని యవసరం లేదు.

ఓహో! అలాగా! అయితే నీవు చెప్పిన దానికి సత్య సమ్మతమైన అర్థాన్ని వివరించు. లేకపోతే నిన్ని ఆశ్రమంనుంచి వెలివేస్తాము. అన్నారు.

కనకదాసు వినయంగా "నేను పోతే పోతాను అన్నాను. అంటే 'నేను' అనే అహంకారం నశిస్తే మోక్షం కలుగుతుందని నా ఉద్దేశ్యం" అని చెప్పాడు.

ఇది విన్న పండితులంతా ముక్కుమీద వేలేసుకున్నారు. "ఔరా! ఒక చిన్న ప్రాకృత పదంలో ఎంత నిగూఢార్థం దాగి యున్నది. ఈ కనకదాసు సామాన్యుడు కాడు. అనవసరంగా యింతకాలం ఇతనిని అవమానించాము" అనుకొని అందరూ కనకదాసుని సాదరంతో చూశారు. అతడి ముఖంలో దివ్య తేజస్సు ప్రకాశిస్తోంది. ఇన్నాళ్ళు తాము తెలిసికోలేని గొప్పతనం అతడిలో కన్పించింది. ఎవరిలో ఎంత జ్ఞానం ఉంటుందో ఎవరు చెప్పగలరు! భగవద్భక్తులు లోకానికి చాలా విడ్డూరంగా కన్పిస్తారు పండితులంతా కనకుని పట్ల స్నేహవాత్సల్యాన్ని చూపారు. పండిత పామరులకు సమంజసమైన, శ్లాఘ్యమైన, ధర్మ సూక్ష్మాన్ని కనకదాసు చక్కగా చెప్పాడని అందరు అతడ్ని పొగిడారు.

అప్పుడు గురువుగారు అందరిని తృప్తిగా చూచి "చూశారా! కనకుడి భావనా శక్తి యెట్టిదో! కనుక "నేను, నాది యన్న అహంకార మమకారాలు వదలి, అంతా ఆ దేవదేవుడి కృపా కటాక్షముతోనే మోక్షాదులు సిద్ధిస్తుందని మనం విశ్వసించాలి.

"విష్ణుర్ది దాతా మోక్షస్య" — విష్ణువు మోక్షమును ఇవ్వదగినవాడు. జీవులకందరికి ఒకేసారి మోక్షము లభించదు. వారి వారి యోగ్యతలను,

సాధనములను బట్టి ఒకరి తరువాత ఒకరికి తారతమ్యానుసారం మోక్షం లభిస్తుంది.

ఇప్పుడు కనకదాసు నన్నుగాని, మిమ్మల్నిగాని కించపరచింది లేదు. "కురుక్షేత్రంలో అర్జునుడు, 'నేను యుద్ధం చేయను.' నాచేతులలో నావాళ్ళను చంపను.' అంటాడు. దానికి శ్రీకృష్ణుడు "అర్జునా! నీవు నిమిత్తమాత్రుడవు. నీది, నీవాళ్ళు అనే అహంకార మమకారాలను దూరం చేయి. ఈ యోధాన యోధులను నా సాయంలేకుండా నీవు చంపలేవు. ఎందులకీ అహంకారము! వీరంతా నీవారా? ఎక్కడిదీ మమకారం? నా ఆజ్ఞ లేనిదే ఏదీ జరుగదు. కనుక నీ కర్తవ్యాన్ని నీవు ఆచరించు." అని బోధించాడు. కనుక "నాహం కర్తాహరిః కర్తా" అనే భావం జీవులలో కలగాలి. కనకదాసు సులభమైన ప్రాకృత పదంతో ఈ భావాన్ని వివరించాడు. ఇలా పండిత పామరులకు సులువుగా వేదాంత తత్వాలను బోధించడానికి పనికి వచ్చేదే దాస సాహిత్యం. దాసుల కీర్తనలు సులభ గ్రాహ్యములు.

మోక్షము లభించడానికి భక్తి జ్ఞానములే ముఖ్య సాధనములు. భక్తి లేక జ్ఞానములేదు. జ్ఞానములేక భక్తిలేదు. సంపూర్ణమైన జ్ఞానము అకళంకమైన భక్తి యెడతెగని ద్వంద్వములు.

"భక్త్యైవ తుష్టి మభ్యేతి
విష్ణుర్నాన్యేన కేనచిత్
సయేవ ముక్తి దాతాచ
భక్తిస్తత్రైవ కారణం."

భగవంతుడు భక్తికే సంతుష్టుడవుతాడు. వేరే యితర సాధనముల చేతకాదు. అతడే మోక్ష మిచ్చువాడు. దానికి భక్తి ఒక్కటే మూలం. అని ఈ శ్లోకం దృఢపరచుచున్నది. భగవద్గీతలో కృష్ణ పరమాత్మ-

"సంతుష్టః సతతం యోగి యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధిః యోమద్భక్తస్సమే ప్రియః."

ఉత్తమ భక్తుడు సర్వకాల సర్వావస్థలలోను మిక్కిలి సంతుష్టుడై మనోనిగ్రహం కలిగి వుంటాడు. జీవిత లక్ష్యాన్ని గూర్చిన దృఢనిశ్చయంతో మనో బుద్ధులను నీ కర్పిస్తాడు. సమస్త భూతములందు స్నేహ భావం కలిగి యుంటాడు. అహంకార మమకారాలను వదలి సుఖదుఃఖాలను సమభావంతో చూస్తాడు. తరచుగా భగవద్గీతలో శ్రీకృష్ణుడు "యోమద్భక్త స్సమే ప్రియః" అంటూ వచ్చాడు. 'ఇటువంటి గుణములు గల భక్తులంటే నాకు ప్రియము.' అతడే మోక్షార్హుడు అని చెప్పాడు. ఎవరు పూర్ణశ్రద్ధతో నుండి సదా నియమితమగు మనస్సు నాయందు లగ్నమొనరించి నన్ను ఉపాసింతురో వారు నా భక్తాగ్రేసరులు అని అన్నాడు.

"భక్తిర్మోక్షాయ కేవలా" భక్తియే మోక్షానికి మూలము. దానాదుల చేత, తీర్థయాత్రలచేత మోక్షము లభించును గదా! భక్తి యెందుకు?" అని అనుమానం కలుగవచ్చును.

"దాన తీర్థతపః యజ్ఞః
పూర్వాః సర్వేపి సర్వదా
అంగాని హరిసేవాయాం
భక్తిస్త్వేకా విముక్తయే."

దానము, తీర్థయాత్రల స్నానము, తపస్సు, యజ్ఞము మున్నగునవి ఎల్లప్పుడు హరిసేవకు అంగములు. భక్తికి సాధనములు.

జీవసంఘములు, దేవతలు, మనుష్యులు, దానవులని త్రివిధములు. అందులోను ఉత్తమ, మధ్యమ, అధములని ప్రత్యేక విభజన కలదు. దేవతలు ముక్తి యోగ్యులు. మనుష్యులలో ఉత్తములే ముక్తి యోగ్యులు. మధ్యములు

నిత్యసంసారమునకు అర్హులు. అధములు నరకార్హులు. దోసవులు అధం తపస్సునకు అర్హులు.

భగవంతునిపైన ప్రేమయే భక్తి యనిపించుకుంటుంది. భగవంతుడు భక్తసులభుడు. అతనిపై భక్తులకున్న అవ్యాజానురాగమే భక్తి.

"జ్ఞానపూర్వః పరస్నేహో నిత్యోభక్తిరితీర్యతే"-అని వేదసారము. మహాత్మ్య జ్ఞానపూర్వకమైనది, భార్యా పుత్రాదుల కంటెను, తనకంటెను అతి దృఢమైనది. శ్రేష్ఠమైనది. నిత్యమైనది భక్తి మాత్రమే భక్తుడు భగవంతునియందు చేయు స్నేహమే (విశ్వాసమే) భక్తియని భావము. భక్తి లేని వారికి జ్ఞానము లేదు. జ్ఞానము గలవాడు ఈ జగత్తులోని సర్వమూ భగవదాధీనమని, యతడే సమస్తమునకు ఆధారభూతుడని విశ్వసిస్తాడు. కనుక భగవంతుని పొందుటకు భక్తి యొక్కటే ముఖ్య సాధనము. భాగవతంలో వేదవ్యాసుడు యిలా స్పష్టం చేశాడు.

"నాలం ద్విజత్వం దేవత్వ మృషిత్వం వాఽసురాత్మజాః
ప్రీణనాయ ముకుందస్య నవృత్తం న బహుజ్ఞతాః
నదానం నతపోనేజ్యా నశౌచం నవ్రతానిచ
ప్రీయతేఽమలయా భక్త్యా హరిరన్యద్ విడంబనం॥

శ్రీహరిని మెప్పింప నిర్మలమగు భక్తియే ముఖ్యకారణము. కేవలము బ్రాహ్మణత్వము, దేవత్వ, ఋషిత్వములు, శమదమాది గుణములు దాన యజ్ఞ తపో శౌచ శీల వ్రతాదులు మాత్రమే కావని చెప్పియున్నారు

ఈ భక్తికూడ ఆనంద స్వరూపముగాను, సుఖ జ్ఞానాది రూపముగాను ఉంటును. "సుఖ జ్ఞానాదికం రూప మేవం భక్తిర్నచాన్యథా"- ముక్తులు యిలా ఉంటారు

"నిర్దోషా నిత్య సుఖినః
పునరావృత్తి వర్జితాః
స్వేచ్ఛయైవ రమంతేత్ర
నానిష్టం తేషు కించన"

దోషరహితులుగాను, నిత్య సుఖము గలవారుగాను (పునరావృత్తి) తిరిగి వెనుకకు రావడము లేనివారుగాను యుండి స్వేచ్ఛగా వైకుంఠాది లోకము లందు క్రీడించు చుందురు. ఇచ్చట దుఃఖమునకు అసూయా ద్వేషములకు తావులేదు. ముక్తుల యందుకూడ భక్తి నిత్యానంద స్వరూపముగా నుండును. మరియు తారతమ్యమునను సరించి అధిక భక్తి యుండును కనుక 'అమలా భక్తిశ్చతత్కారణం' అనుటను మరువరాదు. అని ఆనాటి సభను చాలించారు గురువుగారు చెప్పిన అంశాన్ని శిష్యులంతా శ్రద్ధాభక్తులతో ఆల కించారు.

వేంకటదాసులు: బాలలూ! చూశారా! కనకదాసుయొక్క మంచి తనం, వినయవిధేయతలు! ఎలాటివో అతణ్ణి ద్వేషిస్తున్న పండిత వర్గం కూడ అతడికి మిత్రులయ్యారు. సజ్జనుల శక్తి అట్టిది. దుష్టులుకూడ సజ్జన సావాసంతో మంచివారుగా మారిపోతారు. భక్తిగలవారికి భాషతో పనిలేదు. ప్రాకృతపదము కాని, సంస్కృతపదం కాని, పాటగాని, శ్లోకంగాని ఏదైనా కావచ్చు. నిండు భక్తి గలిగి వున్నప్పుడే విలువ.

మానవ మాత్రులు 'నేను-నాది' అన్న అహంకారంతో ప్రవర్తిస్తే భగవంతుడు 'నీవు-నీది' ఏమున్నది అంతా నా సంకల్పానుసారం జరుగు తుంది అని నిరూపిస్తాడు. "Man Proposes But God Disposes" అని ఆంగ్ల సామెత కనుక స్వార్థము స్వాహంకారము కూడదు.

గోపాల విఠలుడనే దాసశ్రేష్ఠుడు స్వాహంకార ఖండన సుళాదిని (పాటను) రచించాడు.

"నిన్న చిత్త ఎన్న భాగ్య ఇన్ను బేరెనగిల్ల ।
మన్నణె అమన్నణె నిన్నదూ సర్వేశ। ---
--- ఎన్నదెంబ అహంకార బిడిసుదేవా ।

ఎన్న సంకల్పవెల్ల నిన్న అధీన వయ్యా ।
నిన్న సంకల్ప కిన్ను భిన్న భిన్నగళిల్ల ।
నిన్నిచ్ఛె స్ప్రేరక నిన్నదూ ఎన్నభార ।
ఇన్నుమున్నెందెందు ఇన్నిదే సిద్ధవయ్యా ।

'ఓ సర్వేశా! నీ సంకల్పానుసారం జరిగేదే నా భాగ్యము. మంచి చెడ్డలు నీవల్లనే నాకు లభిస్తుంది. 'నాది' అనే అహంకారాన్ని పోగొట్టు. నే చేసే కార్యాలన్నీ నీ అధీనములు. నీ సంకల్పానికి ఎదురులేదు. నీఇచ్ఛా మాత్రంతో అన్నీ పూర్ణులు చెందగలవు. నీవె ప్రేరకుడవు. నాభారమంతా నీదే. సర్వకాల సర్వావస్థ లందునా ఇది సత్యము.' అంటూ వివరించారు.

జగత్తును ఆడించే సూత్రధారి భగవంతుడు. ఈసర్వజగత్తుకు సృష్టి స్థితి, లయకారకు డతడే. ఇది అతడికి 'క్రీడ' లాంటిది. ఎలా చిన్నపిల్ల లంతా ఇసుకతో గుజ్జనగూళ్ళను నిర్మించుకొని— 'ఇది నా కోట—' 'నాఇల్లు' అనుకొని ఆడుకుంటారో, ఆట అయిన తర్వాత ఇళ్ళకు వెళ్ళేటప్పుడు తాము నిర్మించుకొన్న ఇసుక గూళ్ళను త్రొక్కి, దానిపై గంతులువేసి అన్నింటినీ కూల్చి ఆనందిస్తారో, అలాగే లక్ష్మీరమణుడు తన ఇచ్ఛా మాత్రంతోనే లోకాలను సృష్టించి, క్రీడించి, లయింపజేస్తాడు. ఇది వాడికి ఆనందాన్నిచ్చే ఆట మాత్రమే. ఈభావాన్ని శ్రీజగన్నాధ దాసులవారు ఈపద్యంలో చక్కగా వివరించారు.

'మళల మనెగళమాడి మక్కళు కెలవుకాలదలాడి పోదడి ।
తుళిదు కెడిసువ తెర డిలకుమీరమణ లోకగళా॥
హాలవు ఒగియలి నిర్మిసువ నిశ్చలను తానాగిద్దు సలహువ।
యలరుణియ పోల్ నుంగువ వగెల్లిహదో సుఖదుఃఖా॥'

కనుక భగవంతుడే సర్వేశ్వరుడు. అత డాడించినట్లు జీవుడు ఆడవలసిందే. అతడు జ్ఞానులకు ప్రియుడు. జ్ఞానులంటే అతడికి ప్రియము. అనాది కాలంనుంచీ జీవుడు— ఈశుడు నిత్యులు. అతడు స్వతంత్రుడు. జీవులకా స్వాతంత్ర్యం లేదు. అతడిపై భక్తి కలిగి వుండాలి. భగవంతుడు జీవులపై భక్తి గలిగి వుంటాడా? ఇది ఏమతమూ అంగీకరించదు. దేవుడి దయ జీవులపై వుంటుంది.

శ్రీ వాసరాయలు భక్తిని గురించి, మోక్ష ప్రాప్తిని గురించి చక్కగా వివరించారు. అలాంటి గురువులపైనకూడా భక్తి గలిగివుంటేనే శిష్యులకు మోక్షం సులభంగా లభిస్తుంది.

"యస్యదేవే పరాః భక్తిః యథాదేవే తథా గురౌ" దేవునియం దెట్టి యుత్తమ భక్తి గలదో, యట్టి భక్తియే గురువు నందు చేయవలెనని ప్రమాణా లున్నాయి. ఈ భక్తి కూడా 'విచ్ఛిన్నము కాని తైలధారవలె భగవంతుని యందుండు ప్రీతి' యని మహర్షుల మతము. "సాత్వస్మిన్ పరమ ప్రేమ రూపా"- అని నారద భక్తి సూత్రము. 'భగవంతుని యందలి పరమ ప్రేమయే భక్తి' అని దీని భావం. 'దేవుని యందుగల నిరంతర స్మరణయే భక్తి' అని శంకరాచార్యులు చెప్పియున్నారు.

కనుక 'భక్తి' ఒక్కటే ముక్తికి సాధనము. భగవంతుడి భక్తులు ఎన్నటికీ నాశమునొందరు. గీతలో శ్రీకృష్ణుడు 'నమే భక్తః ప్రణశ్యతి' అని చెప్పియున్నాడు. కనకుడు గొల్లవాడైనా ఇట్టి భక్తి భావంతో పరి

పూర్ణుడై భాసించాడు. భక్తితో పాటలు పాడినా, జపము చేసినా, పత్రము పుష్పము, తోయము సమర్పించినా భగవంతుడు సంతుష్టుడౌతాడు.

కనకదాసు కేశవనామాలలో
"జ్ఞానభక్తి కొట్టునిన్న
ధ్యానదల్లి ఇట్టుసదా
హీనబుద్ధి బిడిసు మున్న
జనార్ధన"— అంటూ భగవంతుడ్ని కోరుకున్నాడు.

ఆనాటి నుంచీ పండిత వర్గము—దాసవర్గము కలసి మెలసి పూజలు భజనలు మున్నగు కార్యక్రమములు జరుపుకొనుచుండిరి. అందరిలోను సమభావం, ఐక్యత యేర్పడింది. అప్పుడు కనకదాసు

"సత్యవంతర సంగవిరలు తీర్థవేతకే
నిత్య అన్నదాన విరలు భయావు యతకె"

అంటూ పాడాడు. గాన రసంతో కవిత్వాన్ని మేళవించి నీతి వాక్యాలను జోడించి రచనలు సాగించాడు. పండితుల సహకారంతో సంస్కృత భాషను నేర్చాడు. 'హరిభక్తిసార' అను శతకాన్ని రచించి ఆదికేశవునకు అంకితం చేశాడు. సంఘము లోని దురాచారాలను ఖండించాడు. ఇతని రచనలలో అన్త్యప్రాసాలంకారములు మెండుగా నున్నాయి.

"నీల వర్ణ విశాల శుభగుణ శీల మునికుల పాల లక్ష్మీ
లోల రిపు శిశుపాల మస్తక శూల వన మాల
మూల కారణ విమల యాదవ జాల హిత గోపాల అగణిత
లీల కోమల కాయ రక్షిసు నమ్మ ననవరత"

ప్రతి పద్యం చివర "రక్షిసు నమ్మ ననవరత" అన్న మకుటాన్ని వాడి యున్నాడు. భగవంతుని మహిమలను వర్ణించటం పిమ్మట అటు

వంటి దేవుడు మమ్ములను కాపాడు గాత! అని ముగించటం ఇతని దాస హృదయానికి గొప్ప తార్కాణము.

"చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్న నా
చదువు నిరర్థకంబు........" అని సుభాషితము.

ఇతడి రచనలు సంస్కారవంతములై, వినయ గుణ పూర్వకములై భాసించింది.

"వేదశాస్త్ర పురాణ పుణ్యద
హాది యను నానరియె తర్కద
వాదదలి గురుహిరియ
రచి.యద మూఢ మతియ నణగె
ఆది మూరుతి నీను నెరె
కరుణోదయను హృదయాంగణ్ణాది
నోదయ వెనగిత్తు
రక్షిసు నమ్మ ననవరత."

ఈ పద్యంలో వేదశాస్త్ర పురాణాల మార్గం తనకు తెలియదని, తర్క శాస్త్రము తెలియని మందమతియైన తన హృదయాంగణము నందు ఆదిదేవుడు నిలచి జ్ఞానోదయమును కలిగించి సర్వదా గాపాడు గాత! అని ప్రార్థించాడు.

ఇతని వినయ సంపదకు, భక్తి జ్ఞానములకు ఈ పద్యం చక్కటి నిదర్శనం.

భగవంతుని కరుణ వలననే రచనా శక్తి తనకు అలవడిందని తరభుగా చెప్పుకొన్నాడు.

వ్యాసరాయలు ఒకరోజు శిష్యబృందముతో కలసి తీర్థాటనకు బయలు దేరారు. అక్కడక్కడ గ్రామాలలోని ప్రజలకు ధర్మోపన్యాసములు చేస్తూ, అందరి చేత భజన కార్యక్రమాలను చేయిస్తూ ఆనందాన్ని కలిగించేవారు.

ఒకసారి గురువు గారు పల్లకీలో ప్రయాణం చేస్తున్నారు. పండితు లంతా వేద పఠనం చేస్తున్నారు. పురందరదాసు, కనకదాసులు పల్లకీ ఇరు వైపుల నడుస్తున్నారు. చేరవలసిన గ్రామం చాలా దూరంలో ఉంది. అప్ప టకే కాలాతీతమవటం వల్ల దైవ పూజకు సమయం అతిక్రమిస్తోంది. గురువు గారు చుట్టూ కలయ చూశారు. దారిలో ఆలయంగాని, మంటపంగాని కన్పిస్తే, నిలచి పూజాకార్యక్రమాన్ని ముగించుకొని పోదామనుకున్నారు. అలాంటి అనుకూలమైన ప్రదేశం కనిపించలేదు.

అప్పుడు వ్యాసరాయలు తన హృదయ మందిరంలోనే భగవంతుని పూజించటానికి పూనుకున్నారు. మహనీయులు, దివ్యజ్ఞాన సంపన్నులే మానసిక పూజను చేయ సమర్థులు. గురువుగారు శ్రీకృష్ణ విగ్రహాన్ని శంఖ తీర్థంతో అభిషేకిస్తున్నారు. తులసి, పూలు మున్నగు వాటితో అర్చిస్తు న్నారు. పూజ నిర్విఘ్నంగా సాగింది. ఇక మిగిలింది రత్న ఖచితములైన ఆభరణాలను దేవుడికి యలంకరించటమే। దేవుడి మెడలో రత్నాలహారం వేద్దామని గురువుగారు హారాన్ని తీసికున్నారు. దాన్ని కృష్ణుడి మెడలో వేసేందుకు ప్రయత్నించారు. కాని అది పట్టలేదు...। ఎంత ప్రయత్నించినా హారం కృష్ణుడు తలమీదుగా మెడలో వేయటానికి వీలుకాలేదు. ఇదంతా వ్యాసరాయలవారి మానసిక పూజలో జరుగుతున్న తతంగం. తన ప్రయత్నం ఫలించనందుకు గురువుగారు దిక్కుతోచని స్థితిలో మిన్న కున్నారు.

పల్లకి ప్రక్కనే నడుస్తున్న కనకదాసు గురువుగారి పరిస్థితిని గమనించి "గురుదేవా! శ్రీకృష్ణుని తలపైనున్న కిరీటాన్ని తీసి యావల పెట్టి హారాన్ని వేయండి." అని సూచించాడు.

వ్యాసరాయలవారు కనకుడు చెప్పినట్లు కిరీటాన్ని తొలగించి హారాన్ని మెడలో వేశారు. ఇప్పుడది చక్కగా సరిపోయింది. తరువాత కిరీటాన్నుంచి యలంకరణ పూర్తి చేశారు. పూజా కార్యక్రమమంతా ముగిసిన పిమ్మట గురువుగారు కనకదాసుని సంభ్రమాశ్చర్యాలతో పలకించారు. కృష్ణుడి విగ్రహానికి హారాన్ని అలంకరించే విషయంలోను, తానుచేస్తున్న నిగూఢమైన మానసిక పూజను అతడు గ్రహించిన విషయంలోను చాలా విస్మయం చెందారు. "ఇతడు అపరోక్షజ్ఞాని" అని భావించి లోలోన మెచ్చుకున్నారు. తరువాత అంతా కలసి ఒక గ్రామాన్ని చేరుకున్నారు. ఆంజనేయస్వామి గుడివద్ద అందరు విశ్రమించారు. గురువుగారు దారిలో జరిగిన సంఘటనను, కనకదాసు గొప్పతనాన్ని శిష్య వర్గానికి తెలిపారు. అందరూ కనకదాసు మహాభక్తుడని, కారణజన్ముడని కొనియాడారు. పిమ్మట భజన కార్యక్రమం జరిగింది.

మరునటిరోజు గుడిలో ఆంజనేయస్వామి విగ్రహానికి పూజలు జరిగాయి. దాసశ్రేష్ఠుడైన ఆంజనేయుడు జీవోత్తముడని శ్రీహరి సర్వోత్తముడని పేర్కొంటూ దాసద్వయం పాటలు పాడింది సదా రామనామాన్ని జపించి హనుమంతుడు మహాభక్తుడుగా కీర్తింపబడ్డాడు. ఎక్కడైతే రఘుకుల తిలకుడైన శ్రీరాముని భజనలు జరుగుతుందో! అక్కడ హనుమంతుడు అంజలి ఘటించి–ఆనందభాష్పాలతో నృత్యం చేస్తుంటాడు.

శ్రీరాముడు సముద్రాన్ని దాటేందుకు సేతువును నిర్మించవలసి వచ్చింది. కానీ ఆంజనేయుడు 'శ్రీరామ' మంత్రాన్ని భక్తితో జపించి సముద్రాన్ని అవలీలగా లంఘించాడు. 'రామనామ' మహిమ అంతటిది!

శత్రువులను ఛేదించునది, ఉపనిషద్వాక్య సంపూజ్యమైనది. సంసార సాగరాన్ని తరింపజేయునది, పాపములను పారద్రోలునది, సమస్త సంపదల నొసంగునది, దుఃఖములను పోగొట్టునది శ్రీరామ మంత్రము. "జిహ్వే!

శ్రీరామ మంత్రం జపతీప సతతం జన్మ సాఫల్య మంత్రమ్"-అని పేర్కొనబడిన మహామంత్రమిది. అట్టి రామనామ మహాత్మ్యాన్ని వర్ణిస్తూ పురందరదాసు

"రామనామ భజిసిదవరి గుంటె
భవద బంధనా"
కామహరన సతియుసదా
నేమదింద భజిసిద — శ్రీరామనామ"

అంటూ పాటపాడాడు. కనకదాసు "రామదూతయైన శ్రీహనుమంతా! 'శరణు శరణు' " అంటూ ఇలా పాట నందుకున్నాడు.

'శరణు శరణు' శరణు దశరథరామ దూతగె
శరణు కురుకుల ధీశగె॥
శరణు వైష్ణవ మత విలాసగె।
శరణు ముఖ్య ప్రాణగె ॥ప॥

1) వారిధియను దాటి వేగది
వనవ కిత్తిదాతగె॥
మేరె యిల్లదె అసురర
సంహరిసిద రణ శూరగె।
వారిజాక్షి సీతాదేవిగె
వరద ముద్రికెయ నిత్తవగె।
ధీర తనదలి అక్షకుమారన
ప్రాణవను కొందవగె॥ ॥శరణు॥

2) రాజసూయవ రచిస బేకెందు
రాజర నీళి దాతగె

రాజముఖియళ రక్షిసి
మృగరాజగె వలి దాతగె
త్రిజగవందిత దేవగె
సజ్జనర ప్రియ యెనిపగె
రాజధర్మగె అనుజనాదగె
రాజపూజిత దాతగె ॥శరణు॥

3) మూరేళు మతవనెల్ల మురిద
ధీర మధ్వ రాయగె
సార తత్వగళెల్ల శోధిసి
సూరె మాడి దాతగె
ఉర్వియొళు పరదేవతాడి
కేశవా దొరె దాసగె ॥శరణు॥

అందరూ పాట విని హర్షించారు. పిమ్మట వ్యాసరాయలు అక్కడ చేరిన పండిత పామరజనుల నుద్దేశించి ఇలా చెప్పారు. "కలియుగంలో భగవన్నామాన్ని జపించి పుణ్యమును సులభంగా సంపాదించ వచ్చును. భగవంతుడికీ అతడి నామమునకు భేదం లేదు. లోక వ్యవహారంతో వర్తించువారు చేయదగినది 'నామ' స్మరణం.

"కృతో యద్ధ్యాయతే విష్ణుం
త్రేతాయాం యజతో మఖైః
ద్వాపరే పరిచర్యాభిః
కలౌ తద్ధరి కీర్తనాత

అని శ్లోకము.

"కృతయుగంలో శ్రీహరిని ధ్యానించటం వలన కలిగే లాభము, త్రేతాయుగంలో యజ్ఞ యాగాదులు చేయటం వలన కలిగే లాభము, ద్వాపర యుగంలో భగవంతునికి పరిచర్యలు చేయటం వలన కలిగే లాభము ఎంతటిదో ; కలియుగంలో శ్రీహరిని 'కీర్తించటం' వలన అంతటి లాభము కలుగుతుంది. ద్వాదశ స్తోత్రంలో శ్రీ మధ్వాచార్యులు ఇలా నుడివి యున్నారు.

"యతతోపి హరేః పద సంస్మరణే
సకలం హ్యఘ మాశులయం వ్రజతి ॥
స్మరతస్తు విముక్తి పదం పరమం
స్ఫుటమేష్యతి తత్కిమపా క్రియతే ॥



కనుక శ్రీహరి నామ స్మరణము పాపములను నశింపజేస్తుంది. అతడ్ని పునః పునః భక్తితో స్మరిస్తే ముక్తి తప్పక లభిస్తుంది. హరి నామ స్మరణం సదా చేయటానికి భక్తియే కారణము. భక్తి నుంచి జ్ఞానము— జ్ఞానం నుంచి భక్తి అభివృద్ధి చెంది భగవత్సాక్షాత్కారానికి దోహదం చేస్తుంది. అనుదినం క్రమం తప్పక నామస్మరణమును సాధనచేస్తే అనంత మైన పుణ్యం లభిస్తుంది.

"గోవిందస్య సదాచింత్యం
నిత్యానంద పదప్రదం

గోవిందుని సర్వకాల సర్వావస్థలందునా చింతించటం వలన నిత్యా నంద ఫలము కలుగును. కనుక పూజలు, జపతపాదులు చేయలేదని చింతించకండి" త్రికరణ శుద్ధితో భగవన్నామాన్ని జపించి, తరించండి !" అని సభను చాలించారు.

ఖోలటూ !

భగవంతుడి నామాన్ని భక్తి విశ్వాసాలతో సదా జపించటం వలన మోక్షం కలుగుతుందని తెలిసికున్నాము. అజామీళుడు మరణావస్థలో నున్నపుడు తన కుమారుని 'నారాయణు' ని తలచుకుని పుణ్యలోకాలను పొందాడు. ప్రహ్లాదుడు శ్రీహరిని ధ్యానిస్తూ కఠిన శిక్షలను ఆనందంగా భరించగలిగాడు.

అతడి శరీరానికి యేమాత్రమూ బాధ కలుగలేదు. పరమ భాగవతోత్తముడైన నారదమహర్షి 'నారాయణ' నామాన్ని సదా జపించే వాడు.

ప్రహ్లాదుడు,

"శ్రీనాథు వర్ణించు జిహ్వ ! జిహ్వ ! !"

– అని చెప్పాడు.

"కలియుగదలి హరి నామవ నెనెదరె
కులకోటి గళు ఉద్ధరి సువదు"

– అని పురందరదాసు నుడివి యున్నాడు.

"శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామ నామ వరాననే"

– అని విష్ణు సహస్రనామం ఫలశ్రుతిలో చెప్పబడింది. శ్రీరామా ! శ్రీరామా ! అంటూ జపించటం విష్ణువు యొక్క సహస్రనామాలతో సమమని దీని భావము.

హరి నామము దరిద్రులకు లక్ష్మి, అల్పాయుష్కులకు బ్రహ్మ, కాలాఖ్య సర్పానికి గరుడుడు, అజ్ఞానములో నున్నవారికి సూర్యుడు,

కనుక మానవులు ఏ పని చేస్తున్నా శ్రీహరి నామాన్నే స్మరిస్తుంటే, ప్రతి పని దేవుడి యాధీనంలో ఉండి జరుగుతున్నట్లుగా భావన ఏర్పడు తుంది. భవబంధాలను నిర్మూలించటాని కిది చక్కని మార్గము.

"ప్రక్షయం యాంతి దుఃఖాన్ని యన్నామ తః"

— అని ద్వాదశ స్తోత్రములో చెప్పబడింది. భగవన్నామస్మరణ సమస్త దుఃఖాన్ని ప్రక్షాళనము చేస్తుంది.

"నమామి నారాయణ పాద పంకజం
కరోమి నారాయణ పూజనం సదా
వదామి నారాయణ నామ నిర్మలం
స్మరామి నారాయణ తత్వమవ్యయం"

శ్రీమన్నారాయణుని పాదకమలములకు నమస్కరించాలి. అతడి పూజలు సదా చేస్తుండాలి. అతడి నామ జపం చేయాలి, అతడి లీలలను స్మరిస్తూండాలి.

భౌతిక వాంఛలు నశించడానికి మనస్సు భగవత్పర మవడానికి భగవంతుని నామజపమే ముఖ్య సాధనము.

"సర్వ సాధన దొళగె నిన్ననామకె సరి
ఉర్వి యొళగ యిల్ల"

— అని విజయదాసుల వారు "రామ జోగి మందు కొనరె ఓ జనులారా!" అని శ్రీరామనామము యొక్క మహాత్మ్యమును భక్త రామదాసు వివ రించాడు.

"భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ మూఢమతే"

అని గోవిందుడ్ని భజించమని శ్రీ శంకరాచార్యులు చెప్పారు.

ఎవరు శ్రీహరిని సర్వకాల సర్వావస్థలందు స్మరించుచుందురో వారు ధన్యులు. శ్రీహరిని భజించెడి దేశం పుణ్యదేశం. స్మరించెడి కాలమే పర్వకాలం. అట్టివారు పలికిందే మంత్రం. వారు చేసే ప్రతి పని 'పూజ' అవుతుంది వారే మోక్షార్హులు విమల మూర్తియగు దేవదేవుని ధ్యానించు వారు బ్రహ్మానందాన్ని పొందగలరు. వారికి జగమంతా బ్రహ్మమయమే ! వారే ముల్లోకములలో వందనీయులు.

"సర్వ దేశవు పుణ్యదేశవు సర్వకాలవు పర్వకాలవు
సర్వ జీవరు దాన పాత్రరు మూరులోక దొళు
సర్వ మాతుగ ళెల్ల మంత్రవు సర్వ కెలసగ ళెల్లపూజెయు
సర్వ వంద్యన విమల మూర్తి ధ్యాన వుళ్ళ వగె"

– అని హరికథామృతసారములో చెప్పబడింది.

శ్రీహరి పాదాంగుష్టము నుంచి జన్మించిన గంగలో స్నానము చేసిన సర్వపాపములు నశించును. అలాంటప్పుడు పురుషోత్తముని నామ స్మరణం యెంతటిదో చెప్పలేము. దేవలోకములోని 'కామధేనువు, కల్ప తరువు, చింతామణి' సేవలు చేయువారికి కామితార్థముల నిచ్చుచున్నవి. శ్రీ ముకుందుని పరమ మంగళ నామము నరకస్థులను గూడ రక్షించ గలదు. శ్రీహరి నామము కైవల్యప్రదము. వేద పురాణ శాస్త్రార్థము. మునీంద్రులకు భక్తులకు అమృత ప్రదము.

ఎల్లప్పుడు శ్రీహరిని తలుస్తూ వుండాలి. అలా కాడి నామాన్ని జపిస్తూ అన్య కర్మల నాచరించినా, అవి పుణ్య కర్మలే అవుతాయి. ఇదట సందేహానికి తావులేదు. భగవంతుడి చింతన చేయక, మనసును ఇతర విషయాల పైన మళ్ళించి, స్నానము, జపము, హోమము, అన్న దానము, గజ, అశ్వ, భూ, ధన, ధాన్యములను దానం చేయటం మున్నగు ధర్మ

కార్యాలు చేసినా ఫలితం శూన్యం ! ఈ విషయాన్ని గూర్చి ఈ పద్యం చెపుతోంది.

"నిన్న సర్వత్రదలి నెనెవవరు
అన్య కర్మగళు మాడిదరు
సరి-పుణ్య కర్మగళెసిసువవు
సందేహ వినితిల్ల
నిన్న స్మరిసదె స్నాన జప
హోమాన్న వస్త్ర గణాళ్వ
భూధన ధాన్య మొదలాదఖిల
ధర్మవు మాడి ఫలవేను !"

ఇక అసలు కథలోకి వద్దాం !

ఒకరోజు సాయంకాలం గురువు గారు కనకదాసును పిలచి "దాస దీక్షను స్వీకరించడానికి గల కారణాన్ని చెప్పు" మన్నాడు ! అప్పుడు కనక దాసు గతంలో శ్రీహరికి తనకూ మధ్య జరిగిన సంఘటనలను క్రమంగా వివరించాడు. కలలో కన్పించి దాసుడవగుమని కోరటం, తాను సమ్మతించక పోవటం, యుద్ధంలో అతడు తనను కాపాడటం, తాను కోరి నప్పుడల్లా 'శ్రీహరి' ప్రత్యక్షమౌతానని తనకు మాట యిచ్చిన విషయాలు చెప్పాడు.

"కనకా ! నీవు కోరినప్పుడంతా శ్రీహరి కన్పిస్తాడు గదా ! ఏదీ ! ఒక్క-సారి మాకందరికి అతని దర్శన భాగ్యాన్ని కలిగించు." అని కోరాడు.

"అలాగే స్వామీ ! రేపు పూజ జరిగే సందర్భంలో శ్రీహరిని చూపుతా" నన్నాడు. మరుసటి రోజు పూజా సమయంలో ప్రజలంతా శ్రీహరిని ప్రత్యక్షంగా దర్శిద్దామని వచ్చారు. కనకుడు శ్రీహరిని స్మరించి

"స్వామీ ! వీరంతా నీ దర్శనం కావాలంటున్నారు ! వీరికా భాగ్యాన్ని ప్రసాదించు" అని ప్రార్థించాడు.

"కనకా ! నీవు చెప్పినట్లు వింటానని నీ కిదివరకే మాట యిచ్చాను. అలాగే చేస్తాను. కాని యే రూపంలో రమ్మంటావో చెప్పు" అన్నాడు.

కనకుడు నవ్వుతూ, "ఏ రూపంలో ఏమిటి ? భైరవాకారంలో వస్తావా ?" అన్నాడు.

"సరే అలాగే వస్తా" నని భైరవ రూపంలో శ్రీహరి మఠంలో ప్రవేశించాడు. అందరూ "ఆహా ! కుక్క కుక్క" అంటూ దానిని కొట్టి తరిమేశారు. అది కనకుని వద్దకు వచ్చి "కనకా ! ఎంతకాలంగా నాకు దెబ్బలు తినిపించాలని అనుకున్నావు!" అని అడిగింది.

కనకుడు "స్వామీ ! యుద్ధరంగంలో నన్ను బాగా కొట్టించావే, అప్పట్నుంచీ వేచియున్నాను" అన్నాడు.

భోజనానంతరం "ఏమిటి కనకా ? దేవుని చూపమంటే చూప లేదే ?" అని గురువుగారు అడిగారు.

"స్వామీ ! దేవుని బ్రాహ్మణులు కొట్టి తరిమేశారు "

"ఏమిటయ్యా ! దేవుడ్ని యెవరైనా కొట్టగలరా ? శునకరూపంలో వచ్చాడు కనుక మైల అవుతుందని కొట్టారు."

"దేవుడికి మైల ఏమిటి? పోనీ రేపు శుచిగా రమ్మని చెప్పు." "అలాగే స్వామి!" అన్నాడు కనకదాసు.

మరుసటి దినం కనకదాసు శ్రీహరితో, "స్వామీ! ఈ రోజు నీవు మడితో మఠానికి వెళ్ళు. మా గురువుగారు నీకు క్షీరపానం చేయిస్తారు" అన్నాడు.

శ్రీహరి అలాగే వెళతానని చెప్పి 'సర్ప' రూపంలో వెళ్ళాడు. అందరూ 'పాము! పాము!' అంటూ గోల చేశారు. అది నేరుగా గురువు గారి చెంతకు వెళ్ళింది. గురువుగారు దానిని చేతితో పట్టుకొన్నారు! పాల గిన్నెను దాని ముందుంచారు! అది పాలు త్రాగుతూంది. అంతా సంభ్రమాశ్చర్యాలతో చూస్తున్నారు! అప్పుడు కనకదాసు

"ఈతనీగ వాసుదేవను ఈ సమస్త జగక ధీశ "పల్లవి"
ఈతనీగ వాసుదేవను ఈ సమస్త జగక ధీశ
దూత గొలిదు తేర తేజిగలను పిడుదు నడిసిదాత "అ"

దనుజయాలిద నణ్ణ నణ్ణన పితన మరిసి కౌరవేంద్ర
నచుజ యాళిదవన శిరవ భేదిసీ
తన్ననుజ యాళిదవన బెంకి ముట్టి దంతె కాద్దు రుగ్మ
ననుజ యాళిదవన నోడిరో, రంగను. 1.
క్రూరవాద గరళ ముఖడి భూరి భటరొళధికి అసమ
వీరనెచ్చి బప్ప శరవమా ఈక్షసి
ధారుణియ చరణ తళదొ ళొత్తి నరన తలెయ కాయద
భార భరిత భారకర్తనొ రంగను 2.
వ్యోమకేశ నిప్ప దళయ నాంతు పొత్త ప్రాణవుళ్ళ
సామ జావనేరి బప్పన శక్తిగె
ప్రేమదింద ఉరవ నాంతు డింగరి గన్న కాద్దు సార్వ
భౌమ బడదాది కేశవరాయను రంగను. 3.

ఈ విధంగా భక్తి పారవశ్యంతో కీర్తించాడు.

పూజ అయిన వెంటనే వ్యాసరాయల వారు కనకుడ్ని పిలిచి తీర్థమిచ్చారు. కనకుడి మహాత్మ్యము తెలిసిన పండితులంతా తొలుత తీర్థాన్ని స్వీకరించడానికి అతడే అర్హుడని భావించారు. అప్పుడు కనకదాసు:

"బతుకిదిను బతుకిదను భవ వెనగె హింగితు
పదుమనాభన పాదవొలుమె యసగాయ్తు "పల్లవి"
హరితీర్థ ప్రసాద జిహ్వగె దొరికితు
హరే నామామృతపు కివి గొదగితు
హరి దాసరు యెన్న బంధుగ లాదరు
హరియ శ్రీ ముద్రె ఆభరణ వాయ్తు"–

అంటూ పాడుతూ ఆనందానుభూతిని అనుభవించాడు.

ఇలాంటి మహిమలు ఎన్నో జరిగాయి! కొద్ది రోజులైన పిమ్మట కనకదాసుకు తీర్థయాత్రలు చేయాలని ఆలోచన కలిగింది ఈ విషయాన్ని గురువుగారికి చెప్పాడు. గురువుగారు "కనకా! తీర్థాటన నెపంతో నీవు ప్రజల మధ్యకు వెళ్ళి, వారి అజ్ఞానాన్ని పోగొట్టు" అని ఆదేశించారు.

కనకదాసు గురువు వద్ద, తక్కిన పండితుల యొద్ద సెలవు పుచ్చుకొన్నాడు. జ్ఞానోపదేశం చేసిన గురువును, సజ్జన సమూహాన్ని వదలి వెళ్ళాల్సి వచ్చిందే! నని చింతించాడు. పురందరదాసు కనకుని వెంట కొంత దూరం వెళ్ళి సాగనంపాడు. కనకుడు "దాస శ్రేష్ఠులైన మీవంటి వారి సాంగత్యము నాకిక లభిస్తుందో లేదో! అని బాధగా ఉంది." అని చెప్పాడు.

అపుడు పురందరదాసు

"గురు దైవత భక్తానాం నభయం విద్యతే క్వచిత్"

అని మహనీయులు చెప్పినారు. భగవంతుని పైన, గురువు పైన, సంపూర్ణ విశ్వాసం గల వారికి భయమెందుకు? ఆ శ్రీహరి మీ వెంట ఎప్పుడూ ఉంటాడు!" అని ఓదార్చి పంపాడు.

కనకుడు తొలుత తన జన్మస్థలమైన కాగినెలికి బయలుదేరాడు. బంధువుల, మిత్రులు కనకుడి రాకను విని సంతోషంతో అతనికి ఎదురు

వెళ్ళారు. కుశల ప్రశ్నలు వేసి పరామర్శించారు. ప్రేమతో ఆహ్వానించారు. కనకదాసు చిరునవ్వుతో వారిని సత్కరించారు. చెన్న కేశవ స్వామి పూజా కార్యక్రమానికి అందరూ హాజరయ్యారు. భజనలు చేశారు. కనకదాసు చక్కటి పాటలతో దేవుని స్తుతించాడు. మధ్యాహ్నం, భోజన సమయంలో మిత్రులంతా అనురాగాతిశయంతో మద్యమును మాంసాహారాన్ని వడ్డించారు. అప్పుడు కనకదాసు "నేను మద్యమును, మాంసాహారాన్ని వదిలి వేశాను. మీరు కూడ వీటిని వదలటం మంచిది. నోరులేని జీవాలను సంహరించటం మహాపాపం! హింసతో కూడిన ఈ కార్యం నరక హేతువు. జాతరలలో జంతుబలులను ఆపివేయండి! అది అనాగరికులు, వివేక శూన్యులు చేసే పని. ఒక ప్రాణిని చంపుట అధర్మం! శాస్త్ర విరుద్ధం! ఇలాంటి పాప కృత్యాలు ఆచరిస్తే పుణ్యం లభించదు. మనము యే బీజాన్ని నాటితే ఆ ఫలమే లభిస్తుంది. సుఖాభిలాషులైన మానవులు తమకు తెలియకుండానే దుఃఖాన్ని కోరుకొంటూ పతనమవుతున్నారు. పవిత్ర కర్మల నాచరించిన జీవులు, పవిత్ర మార్గంలో పయనిస్తారు. "అహింసో పరమోధర్మః" అని శాస్త్రవాక్యం. కనుక నే చెప్పినది విని అలా నడచుకోండి."

"మద్యపానము మానవుల జ్ఞాపక శక్తిని నశింపజేస్తుంది. ఎన్నో జన్మల నుండి లభించిన పుణ్యమంతా పోతుంది. జ్ఞానాన్ని పోగొట్టి అజ్ఞానాన్ని పెంచుతుంది. అనారోగ్యము, అశాంతి, కోపము, అసూయా ద్వేషములు వృద్ధి చేస్తుంది. సంఘములో నైతిక విలువ పతనమవుతుంది. గృహజీవితం సక్రమంగా సాగదు" అని ఉపదేశించాడు.

బాలలూ! సాత్విక, రాజస, తామసములని ఆహారము మూడు విధాలుగా విభజింపబడింది.

"దేవా నామమృతం,
నృణా మృషీణాం చాన్న మోషధీః
దైత్యరక్షః పిశాచా దే
ర్ధతం మద్యా మిషాదిచ॥"

అని శ్లోకం. "దేవతలకు అమృతము, మానవులకు అన్నము, ఋషులకు కందమూల ఫలములు, భూత ప్రేత రాక్షసాదులకు, మద్య మాంసాదులను ఆహారంగా బ్రహ్మ దేవుడిచే సృష్టి కాలంలోనే యేర్పరుపబడింది."
విజ్ఞులు దీనిని తెలిసికొని ఆచరించటం శ్రేయస్కరం. గీతలో పరమాత్మ

"యుక్తాహార విహారస్య
యుక్త చేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావ బోధస్య
యోగో భవతి దుఃఖః"

అని చెప్పాడు. "నియమితమైన ఆహార విహారములు గలవాడును, కాలోచిత కర్మను అనుష్ఠించువాడును, ఉచితమైన నిద్ర, జాగరణ గలవాడును దుఃఖాన్ని పొందడు" అని దీని తాత్పర్యము.

ఆహారము యొక్క సూక్ష్మాంశము మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములుగా మారుతుంది. కనుక సాత్వికాహారాన్ని భుజించాలి. అన్నమును మార్పు చేసికుంటే మనస్సునకు మార్పు గలుగుతుంది.

"మాంస భక్షయి తాముత్ర
యస్య మాంస మిహాసితం
ఏ తన్మాంసస్య మాంసత్వం
ప్రవదంతి మనీషిణ."

అని మను శ్రుతి. "ఇహలోకంలో ఏ మనుజుడు ఏయే జంతువుల మాంసమును తినునో పరలోకమున వాని మాంసము ఆయా జంతువులు తినుటకై కాచుకొని యుండును." అని దీని తాత్పర్యము. కనుక విధి నిషేధమైన ఆహారమును తినరాదు. నిర్మలమగు సాత్వికాహారి, లోకములో గల సమస్త ప్రాణులకు మిత్రుడవుతాడు.

ఆనాడు కనకదాసు బోధనలకు అచటి వారంతా సమ్మతించి, మాంసాహారాన్ని పరిత్యజించారు. అంతా కలసి సాత్వికాహారాన్ని భుజించారు. కనకదాసు కొద్ది రోజులు అట గడిపి చెన్న కేశవునిపై పెక్కు కీర్తనలను రచించాడు.

ఆలయ ధర్మకర్తల లోపాలను చూపి వారిని సన్మార్గులుగా చేశాడు. ఈనాడు దేవుడి పేరిట డబ్బులు వసూలు చేసి స్వార్థానికి వాడుకుంటు న్నారు. భగవంతునికి వినియోగించవలసిన ధనాన్ని తస్కరించటం మహాపాపం.

ఒకరోజు రాత్రి శ్రీవారి కనకునికి కనిపించి "కనకా! నీవు పిలచినప్పుడల్లా నేను వచ్చాను. నీవు ఒకసారి తిరుపతికి వచ్చి, నా కల్యాణోత్సవాన్ని చూచి ఆనందించు." అని చెప్పాడు. మరుసటి రోజు ఉదయాన్నే అతడు తిరుమలకు బయలుదేరాడు. యాత్రికులంతా గోవిందా! గోవిందా! అంటూ కొండనెక్కుతుంటే కనకదాసు పొంగిపోయాడు. పాటలు పాడుకొంటూ తిరుమల చేరుకొన్నాడు.

శ్రీనివాసుడు అప్పటి మహంతుకు కలలో కనిపించి నా భక్తుడైన కనకదాసు వస్తున్నాడు. అతడికి సకల మర్యాదలు చేయవలసిందని ఆదేశించాడు. మహంతు ఆశ్చర్యంతో "ఆహా! దేవుని భక్తుడు ఇక్కడకు వస్తున్నాడా! అతని పేరు కనకదాసా!" అనుకొని ఉదయాన్నే లేచి కనకదాసు కోసం యెదురుచూశాడు. ఎదురుగా వస్తున్న యాత్రికులను చూచి,

కనకదాసు ఎవరు?" అని ప్రశ్నిస్తూ వచ్చాడు. ఎవర్నడిగినా తమకు తెలియ దన్నారు. ఎంతసేపు వెతికినా అతడి జాడ తెలియలేదు. మహంతు కలవర పడ్డాడు. వచ్చేపోయే వారినందరిని నిలిపి, 'కనకదాసు ఎవరయ్యా!' అంటూ బిగ్గరగా అరుస్తూ, అటూ ఇటూ తిరుగసాగాడు. అంతలో కనకదాసు ఏక తారను మీటుకుంటూ పాటలు పాడుకుంటూ యెదురు వచ్చాడు. మహంతు నీవేనా కనకదాసువి? అని ప్రశ్నించాడు. అప్పుడతడు "ముందుపోయిన వారికి వెనుక వచ్చేవాడు, వెనుక వచ్చువారికి ముందుపోయేవాడని" బదులు చెప్పి, ముందుకు సాగిపోయాడు. ఎవడో పిచ్చివాడనుకుని మహంతు యాత్రికులవైపు వెళ్ళాడు.

ఆరోజంతా కనకదాసుకు దైవదర్శనం లభించలేదు. ఆకలితో అలమ టించిపోయాడు. ఉండటానికి చోటు దొరకక చలికి వణికిపోయాడు. "ఆహా! స్వామీ! శ్రీనివాసా! ఇదేనా నీ పెండ్లి వైభవం!" అనుకుంటూ ఒకచోట కూర్చు న్నాడు. అప్పుడొకవ్యక్తి పాలు, నైవేద్యం తెచ్చి కనకదాసు ముందుంచాడు సంతోషంతో వాటి నారగించి "నీవెవ్వరయ్యా!" అని అడిగాడు. దానికా వ్యక్తి "నేను నేనే" అని సమాధానమిచ్చి అదృశ్యమయ్యాడు. సాక్షాత్తు శ్రీనివా సుడే యిలా విచ్చేశాడని కనకదాసు అనిర్వచనీయమైన ఆనందానుభూతిని పొందాడు. వెంటనే,

"ఏనెందు కొండాడి స్తుతిసలోదేవా।
నానేను బల్లె నిమ్మమహిమె గళమాధవా ॥ప॥

హరిముకుందను నీను నరజన్మహుళ నాను।
పరమాత్మనీను పామరను నాను॥
గరుడ గమనను నీను మరుళ పాపియు నాను।
పరంజ్యోతియు నీను తిరుకను నాను॥

వారిధి శయనాద కారుణ్య పతి నీను।
ఘోర ధిందిహ కామి క్రోధి నాను॥
ఈరేళు భువన దొళు ఇరువ మూరుతి నీను।
దూరి నిమ్మను చైవ దుష్ట నాను॥ 2

అనురేణు తృణ గళలి పరిపూర్ణను నీను।
క్షణ క్షణకె అవగణద కర్మి నాను॥
వాణియ రసనపెత్త వైకుంఠ పతి నీను॥
తనునిత్య వల్లదె గొంబె నాను। 3

కంబదలి బంద ఆనంద మూరుతి నీను॥
నంబికిల్లద ప్రపంచిగను నాను।
అంబరీషగె వొలిద అక్రూర సఖ నీను॥
ధంభ కర్మియు నాను నిర్భితను నాను। 4

తిరుపతియ వాస శ్రీ వేంకటేశను నీను॥
స్మరిసి నిన్నయ నామ బద్ధుకవను నాను।
బిరిదుళ్ళవను నీను మరిహొక్కవను నాను॥
సిరికాగి సిలయాది కేశవను నీను॥ 5

అని పరవశించి పాడాడు. ఆ రోజు గడిచింది. ఉదయాన్నే లేచి స్వామి పుష్కరిణిలో స్నానంచేసి, భగవంతుడి దర్శనార్థం బయలుదేరాడు. మహంతు కనకదాసుని వేషం, పాటలు పాడే తీరు గమనించి 'ఇతడే భగవంతుడు చెప్పిన వ్యక్తి' అనుకుని దాసులవారికి సకల మర్యాదలు చేశాడు. ఏకాంతసేవ చేసేందుకు అవకాశమిచ్చాడు. కనకదాసు తనివితీరా శ్రీనివాసుడి దర్శనం చేసికున్నాడు.

"గోవింద సలహెన్నను-సదానంద, గోవింద సలహెన్నను
గోవింద సలహెన్న కుముదలోచన నిన్న
సేవకరడియ సేవకనయ్య గోవింద"-

అంటూ కీర్తించాడు. శ్రీనివాసుని కల్యాణోత్సవాన్ని తిలకించాడు. అతడు పొందిన ఆనందానికి అంతులేదు.

కనకదాసు తన జీవితకాలంలో చాల భాగం తిరుమల క్షేత్రంలో నివసించినట్లు తెలిసింది. భాగవతుల సాన్నిధ్యంతో భగవంతుడి మహిమలు వ్యక్తమౌతాయి. విజయదాసులవారు తిరుపతికి వెళ్ళినపుడు "స్వామీ, నీదర్శనానికై నేను రాలేదు. నీభక్తుల దివ్యచరణాలను చూద్దామని వచ్చాను" అని చెప్పాడు. పుణ్యక్షేత్రాలలో భక్తులను సజ్జనులను-మహాత్ములను దర్శించటం భగవద్దర్శనంతో సమానం. కనకుడు తిరుమలలో కొంతకాలం గడిపాడు. అచటి ప్రజలకు హిత ముపదేశించాడు.

"దాన ధర్మవుమాడి సుఖియాగు మనవే"- దానధర్మాలు చేసి సుఖించండి. అదే సర్వదా మనల్ని కాపాడగలదు. సంపాదించిన ధనధాన్యములు అశాస్వతములు. మన శరీరమే క్షణభంగురమైనపుడు తక్కినవి శాశ్వతములా? కనుక పరోపకారం చేయాలి. ఆపదల్లో వున్నవారిని ఆదుకోవాలి. అంటూ పాటల రూపంలో ప్రబోధించాడు. తత్వాలను పాడాడు. కలియుగపు ప్రభావాన్ని జనులకు వివరించాడు.

"కలియుగది మహిమెయను కండష్టు పేళవేను ॥ప॥
కమలనాథన కృపెయ పడెదవరు కేళి ॥అ॥

1. సత్య ధర్మగళెల్ల ఎత్తహోదవో కాణె।
ఉత్తమర జీవన కెదారి యిల్ల।
నిత్యదలి కళవు వ్యభిచార వుళ్ళవరెల్ల।
అర్థసంపన్న రాగ్యసుఖవిసుతిహరు॥

2. అత్తెయే సొసెయాగి సొసెయు అత్తెయు ఆగి।
పుత్రపితనాగి పితపుత్రనాగి॥
మత్తెగండనిగె హెండతియె గండళు ఆగి।
వర్తిసువరయ్య తమ్మగెదురిల్ల వెందు॥"

అంటూ కలియుగంలో జరిగే అత్యాచారాలను పేర్కొంటూ వచ్చాడు. 'ఓ జీవులారా! హెచ్చరికతో మసలుకోండి!' అని చెప్పాడు.

కనకదాసు తిరుపతి నుండి బయలుదేరి 'ఉడుపి' క్షేత్రం చేరుకున్నాడు. త్రోవలోని పుణ్యక్షేత్రాలను దర్శించి, ప్రజలకు హితోపదేశం చేశాడు. పెక్కుపాటలను రచించాడు.

ఉడుపిలోని మఠానికి అధిపతిగావున్న శ్రీ వాదిరాజులు అపుడు దేశసంచారంలో వున్నారు. కనకదాసును గుర్తించే వాళ్ళు కాని, అడిగే వాళ్ళు కాని లేకపోయారు. గుడిలోకి వెళ్ళటానికి అనుమతి లభించలేదు. అక్కడి నియమ నిబంధనలు అలాంటివి. శ్రీ కృష్ణుని సందర్శించాలని ఎంతో ఆశపడి వచ్చిన కనకదాసుకు నిరాశ కల్గింది. 'శ్రీహరీ! తిరుమలకు రమ్మని పిలిచావు, వచ్చాను. దర్శన భాగ్యం లభించింది. ఇపుడు పిలవని పేరంటమని, నాకు దర్శనంలేకుండా చేస్తున్నావా? కురబవాడినని నాకు అనాదరమైతే; మరి కృష్ణా! నీవు గొల్లవాడివి కదా? నీ దర్శనం కూడ లభించకపోతే ఇక నాకు గతిలేదు అంటూ పరితపించాడు. గుడి ముందు భాగంలో ప్రజలంతా గుంపులు గుంపులుగా భగవద్దర్శనం కోసం వేచివున్నారు. కనకుడు ఆలయంయొక్క పశ్చిమ భాగం చేరుకున్నాడు. దేవుడ్ని స్తుతిస్తూ నిలుచున్నాడు.

"పూర్వ జన్మది నాను మాడిద కర్మదిం।
దుర్వియొళగె ఈ జన్మ తాళిదెనో కృష్ణ॥
కారుణ్యనిధి ఎన్నకాయ బేకయ్య హరి।
వారిజ నాభనె ముద్దు ఉడుపియ కృష్ణ॥

అంటూ పాడుకొంటున్నాడు. మఠంలోని వాళ్ళు కనకదాసును చూసి 'నీవెవడవు? నీకులమేది?' అని ప్రశ్నించారు. అప్పు డతడు.

"కుల కుల కులవెన్నుతిహరీ
కులయావుదు నోడి సత్యసజ్జనరె" ॥ప॥

అంటూ తను రచించిన పాటను మళ్ళీ పాడి వినిపించాడు.

అప్పుడు మఠంలోనివారు "అయ్యా! ఇలాంటి తత్వాలు మా కద చెప్పకు. మేము ఆచార పద్ధతులను అతిక్రమించి వర్తించము. కనుక వాదనలు చేయక ఇక్కడ్నుంచి బయటికి వెళ్ళు" అని చెప్పారు.

కనకదాసు స్వామీ! శ్రీకృష్ణా! పతితపావనా? దీనజనోద్ధారా! నీ దాసాను దాసుడను, నీదివ్యదర్శనం కలిగించు దేవా? ఆర్తత్రాణ పరాయణా! ఆదికేశవా? నన్ను కరుణించు స్వామీ! అంటూ ఆక్రోశించాడు, ఆవేశంతో ఇలా పాట పాడాడు.

"బాగిలను తెరెదు సేవెయను కొడు హరియే ॥ప॥
కూగిదరూ ధ్వని కేళిల్లవె నరహరియె ॥అ. ప॥

1. పరమపద దొళగె విషధరన తల్పదలి నీ।
సిరిసహిత క్షీరవారిధి యొళిరలు॥
కరిరాజ కష్టదలి ఆదిమూల యెందు।
కరెయలాక్షణబందు ఒదగిదయొ హరియే॥

2. కడు కోపదింఖళసు ఖడ్గవనె పిడిదుని।
న్నొడెయ నెల్లిహనెందు నుడియె॥
దృఢభకుతి యలి శిశువు బిడదె నిన్నను భజిసి।
నడగరడి స్తంభదిందొడెద నరహరియె॥

3. యమసుతన రాణి గక్షయ వసనవ నిత్తె॥
సమయదలి అజామిళన పొరదె॥
సమయా సమయవుంటె భక్తవత్సల నినగె।
కమలాక్ష కాగి నెలె యాది కేశవనె॥

వెనువెంటనే గుడివెనుక వైపునున్న గోడ కొంచెంగా కూలిపోయింది. తన భక్తుడ్ని అనుగ్రహించాలని శ్రీకృష్ణుడు గుడి పూర్వభాగంనుంచి పశ్చి మాభిముఖంగా తిరిగి కనకుడికి దర్శనమిచ్చాడు. అఘటన ఘటనా సమర్థుడి లీలలు వర్ణించనలవి కావు...ఇలా శ్రీకృష్ణుడి విగ్రహం ముందునుంచి వెను కకు మరలటంతో అక్కడి వారంతా భయభ్రాంతు లయ్యారు. ఇదంతా కనకుడి భక్తికి నిదర్శనమని తలంచారు. అతడి మహిమలను స్తుతించారు.

కనకదాసు ఆనందపారవశ్యంతో, కన్నీళ్లు రాల్తూండగా శ్రీకృష్ణుని దర్శనం చేసుకున్నాడు. అనేక విధాలా భగవంతుడ్ని కీర్తించాడు. సాష్టాంగ దండప్రణామా లాచరించాడు. "అలనాడు కష్టాల్లో వున్న కరిరాజు, ప్రహ్లాదుడు, ద్రౌపది మున్నగువారు ఎలుగెత్తి పిలచినపుడు వచ్చి వారిని రక్షించావు. ఈనాడు నన్నుద్ధరించటానికై ఇలా దర్శనమిచ్చావు! స్వామీ! నీ దయకు అంతము లేదు. అని తన్మయత్వంతో అలాగే వుండిపోయాడు.

ఆలయపూజారులు, అచ్చట చేరిన జనులంతా ఈ విచిత్రాన్ని గూర్చి ముచ్చటించుకొనుచున్నారు. "ఇది నిజమా! కలయా! ఏమిటిది? ఎన్నడూ జరగనిది, జరగకూడనిది జరిగిపోయింది. భగవంతుడి విగ్రహమే వెనుకకు తిరిగిపోయింది. ఆహా! ఈ పుణ్యాత్ముడి భక్తి ఎంత గొప్పది? లోకంలో ఇలాంటి మహాత్ములు కోటికొకరుంటారు." అని అనుకున్నారు.

మఠంలోని వారు 'అయ్యో! అనవసరంగా మహాత్ముడైన ఇతడ్ని నొప్పించాము. తక్కువకులంవాడని బయటికి వెళ్ళిపొమ్మన్నాము. ఎంత అపచారం జరిగింది!' అంటూ కనకదాసుకు క్షమాపణలు చెప్పుకున్నారు.

జరిగిన ఈ అద్భుత సంఘటన క్షణంలో క్షేత్రమంతటా ప్రాకిపోయింది ప్రజలంతా తండోపతండములుగా గుడికి రాసాగారు. రకరకాలుగా వ్యాఖ్యానాలు చేస్తూ భగవంతుడి మహిమలను కొనియాడుతూ, కనకదాసును చూచిపోతున్నారు.

కొందరు "ఆహా! మహాత్ములు ఏ రూపంలో, ఎప్పుడెక్కడ, వుంటారో చెప్పలేము. భగవద్దర్శనార్థం వచ్చిన ఇతడ్ని పూజారులు అడ్డగించారట. ఎంతటి అపరాధం చేశారు! దేవుడి దర్శనానికి కులమతాల వ్యత్యాసా లెందుకు! పవిత్రమైన క్షేత్రంలో అపవిత్రపు భావా లెందుకు? అణురేణు తృణ పర్యంతము వ్యాపించిన ఈశ్వరుణ్ని ఆలయంలో బంధించి, తమ స్వంతమని పూజారులు తలంచవచ్చునా?" అన్నారు.

అసలు ఇలాంటి సంఘటనలు జరక్కపోతే భగవద్భక్తులను గుర్తించటం కష్టం! తన భక్తునికోసం భగవంతుడిలా చేశాడు. దీనితో భక్తుల యొక్క గొప్పతనం వెల్లడయింది. ఆలయాలలో దేవుడున్నాడనేది ఋజువైంది. అని మరికొంద రన్నారు.

ఆ దేవుడే పూజారులను ప్రేరేపించి, ఈ విధంగా చేయించి వుంటాడు. ఇక్కడి పూజారులు నిమిత్తమాత్రులు. అంతా వాడాడించే జగన్నాటకం! అని మరికొందరు తలా ఒకటి తమకు తోచినట్లు చెప్పుకుంటున్నారు. వారి మాటలకు, భావాలకు అంతం లేదు. ఇది లోకం తీరు! మంచి జరిగినా, చెడు జరిగినా నిమిషాల మీద ప్రచారం చేసేస్తారు. గోరంతలు కొండంతలు చేసి చెప్పుకుంటారు. కట్ట తెగిన చెరువులోని నీటిని ఆపటం ఎంత కష్టమో! లోకుల నోళ్ళను మూయించటం అంత కష్టం!

మొత్తానికి కనకదాసు చరిత్రలో ఈ ఉడుపి సంఘటన జరగలేదని కొందరంటున్నారు. ఇది సత్యదూరమనీ, అసలు దేవుడి విగ్రహం పశ్చిమాభిముఖంగానే వుందని, గుడి అలాగే కట్టబడినదని వీరి వాదం.

ఇది భగవద్భక్తుల మహిమలకు సంబంధించిన విషయం! తాతల కాలం నుంచీ పరంపరగా వస్తున్న కథ యిది. కనకదాసుకు, శ్రీహరికీ మధ్య జరిగిన అనేక వింత సంఘటనల్లో ఇది కూడ ఒకటి కర్ణాటక భక్త విజయ మనే పుస్తకంలో ఈ కథ వివరించబడింది. ఇది సత్యసమ్మతం కాదంటే రేపు మరొకడు అసలు వ్యాసరాయల మానసిక పూజ, శ్రీహరి పాము రూపంలో రావటం, అన్నీ కట్టు కథలని చెప్పవచ్చు. మహాత్ముల జీవిత చరిత్రల్లోని మహిమలను తెలిపే కథలన్నీ కల్ల కథలుగా భావించవచ్చు. ఒకటి సత్యమైతే అన్నీ సత్యములే. ఇలా ప్రతిదానికి నిరూపణలు, వాద ప్రతివాదములు చేసకొంటూ పోరాదు. "యద్యదాచరతి శ్రేష్ఠః"—అన్న గీతావాక్యాన్ననుసరించి పెద్దలు చెప్పినది, తరతరాలుగా అనూచానంగా వస్తున్నదే నిజమని భావించాలి. తప్పదు.

ఆ తర్వాత పూజారులు కనకదాసుకు తీర్థ ప్రసాదా లిచ్చారు. సత్కారాలు చేశారు. అతడు శ్రీహరిని మనసారా సేవించాడు. భజనలు చేశాడు. అందరికీ వీడ్కోలు చెప్పి బయలుదేరాడు.

బాలలూ !

"ఏ పుట్టలో ఏ పాముంటుందో చెప్పలేము ? ఎవరిలో ఎంత మహిమ వుంటుందో, ఎవ రెలాంటివారో, – తెలిసికొని విమర్శించాలి. అసలు కఠినంగా మాట్లాడటమే అపచారము "వాక్పారుష్యము చనునే మహా దారుణ మది విషము కంటె, దహనము కంటెన్" అని భారతంలో చెప్ప బడింది. పూజారులు కనకదాసును బయటికి వెళ్ళమని కఠినంగా చెప్పారు. తర్వాత అతడి గొప్పతనం గుర్తించి క్షమాపణలు చెప్పుకున్నారు.

మానవులు ముఖ్యంగా త్రికరణములను శుద్ధిగా వుంచుకోవాలి. దేహ శుద్ధి, వాక్శుద్ధి, మనశ్శుద్ధి గలిగి వుండాలని, దీనినే త్రివిధ తపస్సులని భగవద్గీతలో విపులంగా వివరించబడింది.

శ్లో॥ దేవద్విజ గురు ప్రాజ్ఞ
పూజనం శౌచ మార్జవమ్।
బ్రహ్మచర్య మహింసా చ
శారీరం తప ఉచ్యతే ॥

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించుట, మృజ్జలాదుల చేత శరీర శుద్ధియు, సత్య దయాదుల చేత హృదయ శుద్ధియు, సన్మార్గ వర్తనము, బ్రహ్మచర్యవ్రతము, అహింస అనునవి కాయిక తపస్సని చెప్పబడినది.

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం
సత్యం ప్రియహితంచయత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే ॥

ఇతరుల మనస్సును నొప్పించనిది, సత్యమును, హితము, సంతోష ప్రదమ నగు మాటలును, వేదోపనిషత్ గీతలను చదువుట, గాయత్రాది మంత్రములను జపించుట వాచిక తపస్సని చెప్పబడినది.

శ్లో॥ మనః ప్రసాద స్సౌమ్యత్వం
మౌన మాత్మవి నిగ్రహః ।
భావ సంశుద్ధిరిత్యేత
త్తపో మానస ముచ్యతే ॥

పవిత్రమైన భావములు, ప్రసన్నత, మౌనము, మనో నిగ్రహము అనునవి మానసిక తపస్సని చెప్పబడింది.

ఈ త్రివిధ తపస్సుల నాచరించు వారికి సంకల్పసిద్ధి యగును. ఆత్మ సాక్షాత్కారము సులభతరమగును. అపరోక్ష జ్ఞానులై భాసించుట కిది మూలము.

శ్రీహరిని దర్శించుటయే అపరోక్షము. బాహ్య చక్షువుతో శ్రీహరిని చూడటము స్థూలాపరోక్షము. హృదయ మందిరంలో పరమాత్మను కాంచుట బింబాపరోక్షము. ప్రతి జీవిలోనూ అంతర్గతంగా బింబ రూపి పరమాత్మ నివసిస్తున్నాడు. ఆ బింబ రూపాన్ని చూడటమే ముఖ్యం. ఇక

అపరోక్ష జ్ఞానము —ఇది కలిగిన వెంటనే సంచిత, ఆగామి, కర్మలు నశిస్తుంది. కానీ ప్రారబ్ధ కర్మలు అలాగే వుంటాయి."

ఇక మనం అసలు కథలోకి వద్దాం. ఇలా కనకదాసు తీర్థ యాత్రలు చేసికొంటూ, కీర్తనలు పాడుకొంటూ, ప్రజలను ప్రబోధిస్తూ కాలం గడుపుతున్నాడు. ఇతను తన జీవితకాలంలో చాలా భాగం 'బేలూరు' లో వసించినట్లు చెప్పబడింది. "శ్రీహరి భక్త సార"మనే గ్రంథాన్ని ఇక్కడనే రచించాడు. పాదచారులై అనేక తీర్థక్షేత్రాలు తిరిగి, అచట దేవుళ్ళను కీర్తించటం ఆనాటి హరిదాసుల ఆచారం.

కనకదాసు తీర్థయాత్రలు ముగించుకొని తిరిగి విజయనగరం చేరుకున్నాడు. వ్యాసరాయల వారి సన్నిధిలో కొంతకాలం వున్నాడు. పిమ్మట తిరుపతికి వెళ్ళి, ఆ తర్వాత తన స్వస్థలం కాగినిలో కొంతకాలం గడిపాడు. అప్పుడు "మోహన తరంగిణి" అనే గ్రంథాన్ని రచించాడు.

ఇతని రచనలు సులభ శైలి గలిగి చదవటానికి మనోహరంగా వుంటాయి. తఱచుగా శబ్దాలంకారములను, అర్థాలంకారములను ప్రయోగించాడు.

"దేవి నమ్మ దేవరు బందరు బన్నిరే...నోడ బన్నిరే"

అన్న పాట జానపద కవితకు చక్కటి ఉదాహరణం. ఇతడి రచనలు నీతి, ధర్మము, సాంఘిక పరిస్థితులు, భక్తి, జ్ఞాన, వైరాగ్యములతో యొప్పి వున్నాయి. శ్రీరాముడ్ని, కృష్ణుడ్ని, వెంకటేశుణ్ణి, ఆదికేశవుడ్ని, లక్ష్మీదేవిని, సరస్వతిని, ఆంజనేయుడ్ని కీర్తిస్తూ కీర్తనలు చాలా వ్రాశాడు.

"ఒంబత్తు హూలిగె
ఒందే నాళవు – చందమామ"
అని పామర జనరంజకంగా 'చందమామ' పాటను రచించాడు.

రామాయణ, భారత, భాగవతాల్లోని సంఘటనలను గురించిన పాటలు కూడ రచించాడు. భారతమంతా ఒక బొమ్మలాటలా ఆడించావు కదా ! స్వామీ ! శ్రీకృష్ణా ! అంటూ ఒక పాట వ్రాశాడు. ఇందులో భారత వీరులంతా పాత్రధారులట.

"బొంబె యాట వ ...
ఆడిసిదె మహాభారత దా
అంబుజ భవాది అమరరునోడులిరలు ..."

ఇతని రచనలలో గొప్పగా పేర్గాంచినవి. 1. శ్రీహరి భక్తసారము, 2. నలచరిత్ర 3. రామధ్యాన చరిత్ర 4. మోహన తరంగిణి. ఇలా సంగీత సాహిత్య సేవలు చేసి కనకదాసు ధన్యుడై భాసించాడు.

కనకదాసు రచనలలో అతడి మనోగతాభిప్రాయములు, అనుభవములు చదువరులకు స్పష్టంగా గోచరిస్తుంది. దేశ కాల పరిస్థితుల కనుగుణంగా, తన స్వానుభవాలను చక్కగా పాటలతో వివరించాడు మచ్చునకు కొన్ని పేర్కొందాము.

దుర్జన స్నేహాన్ని గురించి :

1. దుర్జనరసంగ ఎండి గొళ్లెనొ హరియె ...
2. "అజ్ఞానిగళ కూడి అధిక స్నేహద కింత
సుజ్ఞాని గళ కూడి జగదవెళెసు ..."

అజ్ఞులతో చేసే అతిస్నేహం కన్నా, సుజ్ఞానులతో జగడమే మేలు అని చెప్పాడు.

పూర్వజన్మ కర్మలను గురించి :

1. "అరిగాదరు పూర్వ పుణ్య బిడదు ...
అజభవాది గళకాదు తిరుదు ..."

2. ప్రాచీన కర్మవు బిడలరి యదో
యోచనెయమాడి బళలు వద్యాతకె మనుజా"

అహంకార ఖండన :

"నాను నీను ఎన్నదిరు
హీన మానవ !
నిన్న జ్ఞానదింద నిన్న నీనె
తెళిదు నోడలో"

విధివ్రాత :

"బ్రహ్మ లిఖితవ మీరి బాళ్వరుంటే"

కపట భక్తి :

"జపవ మాడిదరేను తపవ మాడిదరేను
కలుష గుణ విపరీత కలుష విద్దవరు ॥

సంస్కృత భాషలో రచించినది :

"నిత్యం పురుషోత్తమం న్యాయం
మృత్యుం సంకట హరణం
ఇహపర సాధన కరుణాకారం

శరణాగత జనాధారం। సరసిజభవ భవరోగ సంహారం శ్రీపురుషోత్తమ ఘోర విహారం॥

జ్ఞాన భక్తి వైరాగ్య సుజాతం। జనన మరణ రహిత జలనిధి పూతం।" ...అంటూ రచన సాగించాడు.

ఇతడి కీర్తనలలో పేరెన్నిక గన్నవి.



1) "తల్లణి సదిరు కంధ్యతాకు మనవె
ఎల్లరను సలహువను ఇదకె సంశయవిల్ల..."

2) తను నిన్నదు జీవన నిన్నదో। ।ప।
అనుదిన దలి బాహు–సుఖ దుఃఖ నిన్నదయ్యా ।అ।

సవినుడి వేద పురాణ శాస్త్రంగళ
కివియల్లి కేళువ కథె నిన్నదో—
నవమోహనాంగి యర రూపవ కణ్ణింద
ఎవెయిక్కదె నోడిద నోటి నిన్నదయ్యా ॥1॥

ఒడగూడి గంధ కస్తూరి పరిమళ గళ
బిడదె లేపిసి కొండ సుఖ నిన్నదూ
షడురస దన్నక్కె సలిదాసువ బిహెన
కడురుచి గొండరె ఆరుచి నిన్నదయ్యా ॥2॥

మాయా పాశద బలెయొళగె సిల్కిరువంథ
కాయపంచేంద్రి యంగళు నిన్నవో
న్యాయది కనకనొడెయ నాదికేశవ
రాయ నీనల్లదె నరర స్వతంత్రవే—

కనకదాసు సాహిత్య సేవను, సమాజసేవను శక్తి వంచన లేక చేశాడు. అలాంటి మహనీయుడి కథను మనం ఈరోజు చెప్పుకున్నాం. కనకదాసు అంత్యదశలో తిరుపతి యందే వున్నట్లు అంతా చెప్పుకున్నారు. కొందరు అతడు 'కాగినెలె'లోనే జీవితశేషాన్ని గడిపాడని, శ్రీ చెన్నకేశవుడి సాన్నిధ్యంలోనే తనువు చాలించాడని చెప్పారు. ఏది ఎలాగున్నా మహనీయుల పుట్టుకకు, జీవితము చాలించుటకు దైవ సంబంధమైన కారణముండి వుంటుంది. ఇక మనం కనకదాసు రచించిన మంగళశ్లోకంతో కథ ముగిద్దాం అంటూ వేంకట దాసులవారు కనకదాసు విరచిత మంగళాన్ని పాడారు.

"మంగళం జగదాది మూర్తిగె
మంగళం జయపుణ్య కీర్తిగె
మంగళం కరకలిత చక్ర విదళిత నక్రనిగె
మంగళం ద్రౌపదియ పొరెదగె
మంగళం ధ్రువరాజ గొలిదగె
మంగళం చేలూరు చెన్నిగరాయ కేశవగె"—

అంతలో శ్రీనివాసుడి ఊరేగింపు బయలుదేరింది. మేళతాళాలు మ్రోగుతున్నాయి. "అదిగో! మంగళప్రదుడు శ్రీనివాసుడు వేంచేస్తున్నాడు. మనం కనకదాసు విరచితమైన కేశవనామాలను పాడుతూ భజన చేద్దాము!"

అన్నారు. అంతా ఉత్సాహంతో లేచి శ్రీనివాసుడి ఊరేగింపు ముందు చేరారు.

అప్పుడు వేంకటదాసు ఆవేశంతో, ఆనంద పారవశ్యంతో ఇలా స్తోత్రం చేశాడు:

"శ్రీనివాసనె భక్తపోషణె
జ్ఞానికుల గళ గభయదాయక
దీనబంధవ నీనెయస మన దర్శపూర్తైసి।
అనుపమోషమ జ్ఞాన సంపతు
వినయ పూర్వక నిత్తు పాలిసొ
జనుమ జనుమకె మరయ బేడవొ శేషగిరివాసె॥

ఆతర్వాత అంతా కలసి కనకదాసు కేశవ నామాలను పాడుకొంటూ భజన ప్రారంభించారు.

ఈశ నిన్న చరణ భజనె-ఆశయింద మాడువేను
దోషరాశి నాశమాడు-శ్రీశ కేశవ ॥ప॥

శరణు హొక్కెనయ్య ఎన్న మరణ సమయదల్లి నిన్న
చరణ స్మరణె కరుణి సయ్య నారాయణ 1

శోధి సెన్న భవద కలుష బోధిసయ్య ఎనగె జ్ఞాన
బాధిసువ యమన బాధె బిడిసు మాధవ 2

హిందనేక యోనిగళలి బందు బందు నొందెనాను
ఇందు భవద బంధ బిడిసు గోవిందనే 3

భ్రష్టనెనిస బేడ కృష్ణ ఇష్టమాత బేడికొంబె
శిష్టరొడనె ఇష్ట కష్ట బిడిసు విష్ణువే 4

మొదలు నిన్న పాదపూజె ముదది మాడ, వెనునాను
హృదయదొళగె హుదుగి సయ్య మధుసూదన 5

కవిదు కొండు ఇరువపాప సవిదు హోగువంతెమాడి
జవన బాధెయన్న బిడిసూ త్రివిక్రమ 6

కామజనక నిన్న నామ ప్రేమదింద పాడువంత
నేమ వెనగె పాలిసయ్య స్వామి వామన 7

మదననయ్య నిన్న మహిమె వదనదల్లి ఇరువంతె
హృదయదల్లి సదన మాడు ముదది శ్రీధర 8

హుసియనాడి హొట్టె హొరెవ విషయదల్లి రసికనెందు
హుసిగె హాక దీరయ్య హృషీ-కేశనే 9

బిద్దు భవదనేక జనుమ బద్ధనాగి కలుషదింద
గెద్దు హోప బుద్ధితోరో-పద్మనాభనె॥ 10

కామక్రోధ బిడిసి నిన్న నామ జిహ్వెయొళగె నుడిసు
శ్రీమహానుభావ నాద దామోదర 11

పంకజాక్ష నీను ఎన్న మంకు బుద్ధి బిడిసి నిన్న
కింకరన్న మాడికొళ్ళొ సంకురుషణ 12

ఏసుజన్మ బందరేను దాస నల్ల వేనునాను
ఘాసి మాడదిరు ఎన్న-వాసుదేవనె 13

బుద్ధి శూన్యనాగి ఎన్న-పద్ధకాల్య కుహుక మనవె
తిద్ది హృదయ శుద్ధి మాడొ ప్రద్యుమ్ననె 14

జనని జనక నీనె ఎందు నెనెవెనయ్య దీన బంధు
ఎనగె ముక్తి పాలిసెందు అనిరుద్ధనె 15

హరుషదింద నిన్న నామ స్మరిసువంతె మాడు నిత్య
విరిసు చరణదల్లి ప్రేమ పురుషోత్తమ 16

సాధుసంగ కొట్టు నిన్న పాద భజనె యిత్తు ఎన్న
భేదమాడి నోడదిరు-అ-ధోక్షజ 17

చారుచరణ తోరి ఎనగె పారుగాణి సయ్య కొనగె
భారహాకిరువె నినగె నారసింహనె 18

సంచితార్థ పాపగళు కించి తాదపీడెగళు
ముంచిత వాగి కళెదు పొరెయొ స్వామి అచ్యుత 19

జ్ఞాన భక్తి కొట్టునిన్న ధ్యానదల్లి ఇట్టుసదా
హీనబుద్ధి బిడిసుమున్న-జనార్ధన 20

జపతపానుష్ఠాన విల్లదె కుపథగామి యాదవన్న
కృపయమాడి క్షమిసబేకు ఉపేంద్రనె 21

మొరెయ ఇదువెనయ్య నినగె శరధిశయన శుభమతియ
ఇరిసు భక్తనెందు పరమ పురుష శ్రీహరీ 22

పుట్టిసలు బేడముందె పుట్టి సిదకె పాలిసిన్ను
ఇష్టేబేడి కొంచెనాను, శ్రీకృష్ణనే 23

సత్యవాదీ నామగళ నిత్యదల్లి పఠిసువరను
అర్థియింద సలహువను కర్తృ కేశవ 24

మరెయదలె హరియనామ ఒరెదు ఓదికెళిద
కిరెదు ముక్తి కొడువనెలె-యాది కేశవ 25

సంపూర్ణం

శ్రీకృష్ణార్పణమస్తు భారతీశార్పణమస్తు

ఇందులో సందర్భానుసారంగా ఈ అంశాలను
వివరించటం జరిగింది

1. గురు మహిమ
2. వినయ సంపద
3. సజ్జన సాంగత్యం
4. హరినామ జప మహాత్మ్యం
5. భక్తి - మార్గం
6. ముక్తి—
7. శ్రీ రాఘవేంద్రుల మహిమ
8. గాన మహిమ
9. మద్యపాన దోషం
10. ఆహార నియమాలు
11. కపట భక్తి
12. అహంకార ఖండన

ఇది నా తొలి రచన. ఇందులోని దోసగులను సహృదయులు మన్నింతురు గాత!

—మురళీధర్.

ఏనుబేడలి యెన్న దేవనె సానురాగది యెన్న పాలిసో
నాన విధ విధ సౌఖ్య నీడువ డిహళ పరంగళలి
శ్రీనివాసనె నిన్న దాసగె ఏను కొరె తెల్లెల్లి నోడలు
నీనె నింతీ విధది పేళిసొ శేషగిరివాసా ।

శ్లో॥ జగదురన అతి విమల గుణ రూపగళ నాలోచనడి భారత
నిగమ తతి గళతి క్రమస్క్రియా విశేషగళ
భగి భగెయ నూతనవ కాణుత మిగె హరుషడిం
బొగళి హిగ్గువ త్రిగుణమాని మహాలకుమి సంతైసలను దినవు

—: శ్రీ కృష్ణార్పణమస్తు :—